ప్రవేశ రుసుము లేదు



# చందమామ కేమెల్
## రంగుల పోటీ

**బహుమతులు గెలవండి**

**కేమెల్**

1 ప్రథమ బహుమతి రూ. 15/-
3 రెండవ బహుమతి రూ. 10/-
10 మూడవ బహుమతి రూ. 5/-
10 సర్టిఫికెట్లు

ఈ పోటీలో 12 సంవత్సరాల లోపల వయస్సు కల పిల్లలు పాల్గొనవచ్చు.
పైన చూపించబడిన చిత్రాన్ని పూర్తిగా కేమెల్ రంగులతో నింపి దిగువ చిరునామాకు పంపండి:
పోస్ట్ బాక్స్ నం. 11501, నారిమన్ పాయింట్ పోస్ట్ ఆఫీస్, బొంబాయి 400 021.
న్యాయనిర్ణేతలదే చివరి నిర్ణయం. దీనికి అందరూ కట్టుబడాలి. ఈ సంబంధంగా ఎలాంటి పత్ర వ్యవహారాలు జరుపబడవు.

Name: .................................................. Age: ....................

Address: ..........................................................................

..........................................................................

ఈ తేదీ లోపల ఎంట్రీలను పంపండి: 31-3-1984

**CONTEST NO35**

చుక్కల గుర్తు గీత వెంట కత్తిరించండి.

Our grateful thanks to The Indian Jaycees for their Warm appreciation of our participation in and contribution to the

## KIDDY'S LAND '83 EXHIBITION

organised by the Cotton City Jaycees in Coimbatore.




**Statement about ownership of CHANDAMAMA (Telugu)**
**Rule 8 (Form VI),**
**Newspapers (Central) Rules, 1956**

1. *Place of Publication*
   'CHANDAMAMA BUILDINGS'
   188, Arcot Road
   Vadapalani, Madras-600 026.
2. *Periodicity of Publication*
   MONTHLY
   1st of each calendar month
3. *Printer's Name*
   B.V. REDDI
   *Nationality*
   INDIAN
   *Address*
   Prasad Process Private Limited
   188, Arcot Road, Vadapalani
   Madras-600 026.
4. *Publisher's Name*
   B. VISWANATHA REDDI
   *Nationality*
   INDIAN
   *Address*
   Chandamama Publications
   188, Arcot Road, Vadapalani
   Madras-600 026.
5. *Editor's Name*
   B. NAGI REDDI
   *Nationality*
   INDIAN
   *Address*
   Chandamama Buildings
   188, Arcot Road, Vadapalani
   Madras-600 026.
6. *Name & Address of individuals who own the paper*
   'CHANDAMAMA CHILDREN'S TRUST FUND

Beneficieries:

1. B.V. NARESH
2. B.V.L. ARATHI
3. B.L. NIRUPAMA
4. B.V. SANJAY
5. B.V. SHARATH
6. B.N. RAJESH
7. B. ARCHANA .
8. B.N.V. VISHNU PRASAD
9. B.L. ARADHANA
10. B. NAGI REDDI (JR)

All Minors, by Trustee:
M. UTTAMA REDDI, 14, V.O.C. Street,
Madras-600 024.

I.B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*
*1st March 1984*

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''శ్రావణుడి కథ''] కు ఆధారం, ఎం. లక్ష్మిగాయత్రి రచన. తనకున్న హెూదాకొద్దీ కిందివాళ్ళపై అధికారం చలాయించే వ్యక్తి, సమర్థుడనిపించుకోవాలంటే, కేవలం కటువుగా, అధికారబలం ఉపయోగించినందువల్ల ప్రయోజనం వుండదు; అతడికి మనుషుల మనస్తత్వం క్షుణ్ణంగా తెలిసివుండాలి. ఇది, ''సమర్థుడు'' అన్న కథలో చక్కగా వివరించబడింది.

## అమరవాణి

న తత్ శస్త్రైః న నాగేంద్రైః, న హయైః న పదాతిభిః,
కార్యం సంసిద్ధి మాప్నోతి, యద్ బుద్ధ్యా తుప్రసాధితమ్.

[బుద్ధిబలం అన్నిటికన్న చాలా శక్తివంతమైనది; అయుధముల చేతా, ఏనుగులా, గుర్రములా, కాల్బలములచేత సాధించలేని కార్యం, బుద్ధిబలం చేత సాధించబడగలదు.]

సంపుటి 74 మార్చి '84 సంచిక 3

విడి ప్రతి : 2–00 : : సంవత్సర చందా : 24–00



# చందమామ కబుర్లు



## మాటలాడే ఏనుగు

సోవియట్ రష్యాలోని కారగాండా జంతుప్రదర్శన శాలలో వుండే ‘బాటీర్’ అనే ఏనుగు తన పేరు చెబుతుంది. ఇంకా, అది వచ్చే వాళ్ళను చూసి ‘మంచి అబ్బాయ్!’ అంటుంది. రోజూ అక్కడికి వచ్చే వాళ్ళ నుంచి, ఆ ఏనుగు, ఈ మాటలు నేర్చినట్టు తెలుస్తున్నది. మాటలను అనుకరించే అద్భుతమైన శక్తి ఈ ఏనుగుకు వున్నది।



## అక్కడక్కడా వానరమానవులు

చైనాలోని హూపీ పర్వత ప్రాంతంలో ఇటీవల కొందరు వానరమానవులు కనిపించారు. శరీరమంతా రాగిరంగు వెంట్రుకలతో, ఏడడుగుల ఎత్తు వుండే ఈ వానరమానవులు ఆకులలములు తింటూ చెట్ల కొమ్మలపై దాటుతూ కనిపించారట।



## చంద్రుడి నుంచి సూర్యకిరణాలు!

ఫ్రాన్స్ దేశపు జాతీయ వ్యోమ పరిశోధనా కేంద్రానికి చెందిన క్రిస్టియన్ మార్చల్ అనే శాస్త్రజ్ఞుడు—రేయిని పగలుగా మార్చే విధానాన్ని రూపొందిస్తున్నాడు. పెద్ద పెద్ద అద్దాలను చంద్రుడి మీదికి చేరవేసి, తగిన పరికరాల ద్వారా వాటిని అక్కడ అమర్చినట్టయితే — అద్దాల మీద పడే సూర్యకిరణాలు అలాగే భూమి మీదికి ప్రతిబింబించి— కొన్ని ప్రాంతాలలోనైనా రాత్రిని పగలుగా మార్చే అవకాశం వుంది అంటున్నాడీ శాస్త్రవేత్త।

## మీకు తెలుసా?

1. హర్షవర్ధనుని ఆస్థానాన్ని అలంకరించిన కవి ఎవరు? అతడు రచించిన గ్రంథాలేవి?
2. పందొమ్మిదో శతాబ్దంలో ప్రసిద్ధి గాంచిన ఆంగ్ల కవిదంపతులు ఎవరో మీకు తెలుసా?
3. ఇంగ్లండులో పందొమ్మిదో శతాబ్దంలో నవలా రచయిత్రులుగా ప్రసిద్ధులైన సోదరీమణులు ఎవరు?
4. బాలల సాహిత్యంలో ప్రసిద్ధి గాంచిన డేనిష్ రచయిత ఎవరో మీకు తెలుసా?
5. తన ఇంటి పేరును రకరకాల అక్షరాలతో రాసిన ప్రసిద్ధ ఆంగ్లకవి ఎవరు?

(సమాధానాలు 64వ పేజీలో)




మాధవరం జమీందారు దగ్గిర, గోవిందు డనే పని కుర్రవాడుండేవాడు. వాడి తండ్రి జమీందారు వద్ద నౌకరీ చేస్తూ, గోవిందుడింకా పసివాడుగా వుండగానే హఠాత్తుగా చనిపోయాడు. వాడికి తల్లి తప్ప, దగ్గర బంధువులంటూ ఎవరూ లేరు. జమీందారు వాడి మీద జాలిపడి, దివాణంలోనే పెంచి పెద్దచేసి, 'వాడికి తండ్రి నౌకరీ యిచ్చి, చాలా దయగా చూస్తూండేవాడు. వాడికి ఇప్పుడు పద్ధెనిమి దేళ్ళ వయసు.

ఒకసారి జమీందారు గోవిందుడికి ఒక పని అప్పగించాడు. ఆయన కుమార్తెకు రాబోయే పౌర్ణమినాడు పక్క ఊరి జమీందారు కొడుకుతో నిశ్చితార్థం జరప వలసివున్నది. అయితే, కారణాంతరాల వల్ల, ఆ ముహూర్తం విదియ నాటికి వాయిదా పడింది. ఆ విషయం కాబొయ్యే వియ్యంకుడికి చెప్పి రమ్మని జమీందారు, గోవిందుడికి చెప్పి, బస్తీలో ఏదో పని వుండి వెళ్ళాడు.

గోవిందుడు పక్క ఊరుకు ప్రయాణం అవుతూండగా, ముందు దివానూ, తరవాత రాణివాసంలోని వాళ్ళూ, రకరకాల పనులు చెప్పారు. దానితో వాడికి సూర్యాస్తమయం యింకొక గంటలో వున్నదనగా తీరుబాటు చిక్కింది.

వాడు పెళ్ళి కొడుకు వాళ్ళ ఊరు పోయి, సంగతి చెప్పి, దారీ డొంకా సరిగా లేని అక్కడి నుంచి చీకట్లో తిరిగి రావడం సాధ్యపడే పని కాదు. కాని, యజమాని చెప్పింది ముఖ్యమైన పని గనక వెళ్ళక తప్పదు.

గోవిందుడు ఏమి చేయడమా అని ఆలోచిస్తున్నంతలో, ముసలి నౌకరొకడు సంగతి తెలుసుకుని, ''పురుగూ పుట్రా —

బొమ్మిడి అచ్చారావు



''వారింట్లో ఎవరికైనా చెప్పావా? జమీందారు గారికే చెప్పి వచ్చావా?'' అని అడిగాడు జమీందారు.

''జమీందారుగారికే చెప్పి వచ్చాను,'' అన్నాడు గోవిందుడు.

''దానికి ఆయనేమన్నారు?'' అన్నాడు జమీందారు.

''అలాగేనని చెప్పమన్నారయ్యా.'' అని జవాబిచ్చాడు గోవిందుడు.

''వారి ఊరు వెళ్ళేదారిలో వున్న వాగు పొంగిందట. ఎలా వెళ్ళగలిగావు?'' అన్నాడు జమీందారు.

గోవిందుడు ఏమాత్రం తొణక్కుండా, ''నాకు ఈత వచ్చుగదా, వాగు ఈది వెళ్ళాను. వచ్చేటప్పుడు బల్లకట్టు మీద దాటానయ్యా.'' అన్నాడు.

జమీందారు తలాడించి, ''జమీందారు గారి అబ్బాయి, వాళ్ళ మేనమామల ఊరు నుంచి నిన్న తిరిగి వస్తాడని చెప్పారు. వచ్చేశాడా?'' అని అడిగాడు.

''వచ్చేశారండి. ఎప్పుడు తిరిగొచ్చారో తెలియదు గాని, వచ్చి ఇంట్లో వున్నారండి,'' అని జవాబిచ్చాడు గోవిందుడు.

''అలాగా! జమీందారుగారి పెరటి గోడ పక్కన వున్న మామిడిచెట్టు పూత పట్టిందిరా, గోవిందా?'' అని ప్రశ్నించాడు జమీందారు.

చీకటి ప్రయాణం ఎందుకు పెట్టుకుంటావు? నిశ్చితార్థానికి యింకా నాలుగు రోజులు గడువుంది. రేపు ఒంట్లో బాగో లేదని సెలవు తీసుకుని, ఆ ఊరు వెళ్ళిరా. బస్తీ నుంచి తిరిగి వచ్చి రాత్రికి బాబుగారడిగితే, కబురు అందజేశానని చెప్పు, సరిపోతుంది,'' అని సలహా యిచ్చాడు.

ఈ సలహా గోవిందుడికి బాగా నచ్చింది. రాత్రి జమీందారు బస్తీనుంచి వస్తూనే గోవిందుణ్ణి వార్త అందజేశావా అని అడిగాడు.

''అందించానండయ్యా.'' అన్నాడు గోవిందుడు.

అది మామిడి చెట్లు పూత వేసే కాలం కావడంతో, గోవిందుడు తడుముకోకుండా, "ఇప్పుడిప్పుడే పూత కొస్తున్నది, బాబు గారూ," అనేశాడు.

గోవిందుడికి యిలా అబద్ధాలు చెప్పుకుంటూ పోవలసి రావడం సంకటంగానే వున్నది. ఇంతటితో యజమాని తనను వదలితే బావుండును అనుకున్నాడు. కాని జమీందారు అందుబాటులో వున్న కుర్చీలో కూర్చుంటూ, "వారి ఎల్లావుకు, ఆ మధ్య నలతగా వున్నదని విన్నాను. ఇప్పుడెలా వుందిరా?" అని అడిగాడు.



గోవిందుడికి వెంటనే ఏం జవాబివ్వాలో తోచింది కాదు. కాని, జమీందారంతటివాడు ఆవుకు వైద్యం చేయించలేక పోతాడా, అది బతక్క పోతుందా అన్న ధైర్యంతో వాడు, "ఇప్పుడు రోగం కుదిరి బావున్నదయ్యా," అని జవాబిచ్చాడు.

ఆ జవాబుతో జమీందారు చిన్నగా నవ్వి, "ఇంతకూ భోజనం చేశావట్రా, గోవిందూ?" అన్నాడు.

వాడికి ఆ సమయంలో బాగా ఆకలిగా వున్నది. తనిప్పుడు ఆ జమీందారుగారి ఇంట్లో భోజనం చెయ్యలేదంటే, ఆయన్ను కించపరిచినట్టవుతుంది.

ఇలా ఆలోచించి వాడు, "వియ్యాలవారు తృప్తిగా భోజనం పెట్టారండయ్యా. ఇక యింటికి పోతాను సెలవిప్పిస్తే!" అన్నాడు.

గోవిందుడుకి యింకా అబద్ధాలాడవలసివస్తుందేమో అని భయం పట్టుకున్నది.

జమీందారు, వాడి ముఖంకేసి సూటిగా చూస్తూ, "అబద్ధాలాడడం ఎప్పటి నుంచి నేర్చావురా, గోవిందా?" అని అడిగాడు.

ఈ ప్రశ్నతో వాడు, తాను అబద్ధాలాడుతున్నట్లు జమీందారుకు తెలిసిపోయిందని గ్రహించాడు. వాడికి భయంతో దడపుట్టుకొచ్చింది.

జమీందారు శాంతంగా నవ్వి, "ఒరే ఏదో కారణం వల్ల, నువ్వు ఆ ఊరు

వెళ్ళలేక పోయివుండవచ్చు. ఆ సంగతి నాకు చెబితే, రేపు వెళ్ళమనే వాణ్ణికదా! ఆ మాత్రానికి అబద్ధం చెప్పడం దేనికి? ఒక అబద్ధం కప్పిపుచ్చడానికి, అబద్ధం మీద అబద్ధం ఆడవలసి వస్తుంది. ఈ సంగతి యిప్పటికి నీకు తెలిసి వచ్చి వుండాలి,'' అన్నాడు.

గోవిందుడు చిన్నగా వణుకుతూ, తల వంచుకు వుండిపోయాడు.

''ఈ సాయంత్రం జమీందారుగారు, నాకు బస్తీలో కనిపించారు. ముహూర్తం మార్పు గురించి ఆయనకు చెప్పాను. ఆయన ఇంట్లో వున్నారని అబద్ధం చెప్పావు. వాగు పొంగిందంటే, నిజమే ననుకుని మరొక అబద్ధం ఆడావు. అది పూర్తిగా ఎండిపోయి వున్నదన్న సంగతి నీకు తెలియదు, అవునా?'' అని అడిగాడు జమీందారు.

''తెలీదు బాబుగారూ! ఆ వాగుకేసి వెళ్ళి చాలా రోజులైంది,'' అన్నాడు గోవిందుడు బొంగురుపోయిన గొంతుతో.

జమీందారు ఆ జవాబుకు పెద్దగా నవ్వి ''జమీందారుగారి అబ్బాయి, యింకా మేనమామల ఇంటినుంచి తిరిగి రాలేదు. ఇకపోతే, జమీందారుగారి పెరట్లో మామిడి చెట్టనేదే లేదు. అక్కడ వున్నది ఒక వేపచెట్టు మాత్రం. ఇలాగే, ఎల్లావుకు జబ్బు చెయ్యడం వగైరా,'' అన్నాడు.

గోవిందుడు వంచిన తల ఎత్తలేదు.

జమీందారు కుర్చీలోంచి లేస్తూ, ''గోవిందా, యిక ఏనాడూ అబద్ధాలాడకు. అబద్ధం నిప్పులాంటిది. ఈనాడు కాకున్నా, రేపయినా బయట పడుతుందని మరిచిపోకు,'' అన్నాడు.

గోవిందుడు చేతులు జోడించి, ''క్షమించండయ్యా! ఇక్కడి ఇంటి పనులతో బాగా ఆలస్యమయింది. తమరు వెళ్ళనందుకు కోప్పడతారని అబద్ధం ఆడాను. ఇంకెప్పుడూ అబద్ధం చెప్పను, బాబుగారూ!'' అన్నాడు.

''సరే! పోయి అమ్మగారినడిగి అన్నం పెట్టించుకు తిను,'' అన్నాడు జమీందారు.






## 11

[పింగళుడు తన తల్లి ద్వారా అన్నలు ఆమెను పెట్టిన హింసలు తెలుసుకున్నాడు. కాని, అన్నలు దొంగ ఏడ్పులు ఏడుస్తూ వచ్చేసరికి, సోదరప్రేమకొద్దీ వారిని యింట్లోకి అహ్వానించాడు. వాళ్ళిద్దరూ పింగళుడు తెచ్చిన ఆస్తికోసం, అతణ్ణి ఒకానొక ఓడసరంగుకు బానిసగా అమ్మేందుకు కుట్రపన్ని, అ పథకం ప్రకారం సరంగును కలుసుకున్నారు. తరవాత—]

**జీ**వదత్తుడు తన తమ్ముణ్ణి గురించి చెప్పినదంతా విని ఓడసరంగు, చేతులు బారచాచి వికటంగా నవ్వాడు. దాని అంతరార్థమేమిటో తెలీక, జీవదత్తుడూ, లక్షదత్తుడూ కళవెళ పడిపోయి ముఖ ముఖాలు చూసుకున్నారు.

ఓడసరంగు కొంచెం సేపు ఆలోచిస్తూ వూరుకుని, తరవాత జీవదత్తుడి కళ్ళల్లోకి గుచ్చి చూస్తూ, "నువు చెప్పేదంతా నిజమేనా? నిజంగా మీ తమ్ముడు పింగళుడు అనేవాడు, మిమ్మల్నీ, మీ తల్లినీ హింసిస్తున్నాడా? నా దగ్గిర అబద్ధాలు పనికిరావు," అన్నాడు.

"నిజం, సరంగూ, నిజం! మా అన్న చెప్పిందాంట్లో ఆవగింజంత అబద్ధం కూడా లేదు. ఇంతకాలం నుంచీ పరమ దుష్టుడైన మా తమ్ముడు పెట్టే బాధలను మేము ఎలా భరించుకు వస్తున్నామో



ఆ పరమాత్ముడికే ఎరుక!" అన్నాడు లక్షదత్తుడు దీనంగా.

ఓడసరంగు మరోసారి ఆ అన్నదమ్ముల ముఖాలను పరీక్షగా చూసి, తల వూపుతూ, "అయితే మీ తమ్ముణ్ణి కొనేందుకు నాకు ఏమీ అభ్యంతరం లేదు. వాణ్ణి నా పడవల్లో కళాసుగా రెండు మూడేళ్ళు వుంచి, వాడి తిక్క కుదిరి దారికి రాగానే, తిరిగి మీ యింటికి పంపేస్తాను, సరా?" అన్నాడు.

"అయ్యో, మీ పుణ్యం ఉంటుంది. ఆ పని మాత్రం చేయకండి!" అంటూ జీవదత్తుడు అదిరిపడ్డాడు. "అసలే వాడు పరమదుర్మార్గుడు. అటువంటివాణ్ణి మీరు రెండు మూడు సంవత్సరాల తరవాత తిరిగి యింటికి పంపితే—వాడు తప్పక మా ప్రాణాలూ, మా తల్లి ప్రాణాలూ తీస్తాడు. వాడి పగ తాచుపాము పగ అనుకోండి!" అన్నాడు.

"అలా అయితే, వాణ్ణి నాకు బానిసగా అమ్మేందుకు మీతోపాటు, మీ తల్లి కూడా ఒప్పుకుంటుందా? తరవాత రాజుగారి దగ్గర నా మీద వ్యాజ్యం చేస్తే లాభం లేదు. ఆలోచించుకు చెప్పండి," అన్నాడు సరంగు.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ దూరంగా వెళ్ళి ఏదో రహస్యంగా మాట్లాడుకున్నట్టు నటించి, తరవాత సరంగుతో వినయం పుట్టిపడేలా యిలా అన్నారు:

"అయ్యా, సరంగూ! అన్ని సంగతులూ మా అమ్మతో మాట్లాడే వచ్చాం. ఆమె వుద్దేశం కూడా ఏదో విధంగా వాణ్ణి యింట్లోనుంచి బయటికి పంపమనే. ఎంత కన్నకొడుకైనా వాడి దుర్మార్గాన్ని సహించే ఓర్పు యిక ఆమెకు లేదు. అలా అని ఆమెకై ఆమె తన నోటిమీదుగా వాణ్ణి బానిసగా తీసుకుపొమ్మని మీతో చెప్పలేదు. అందుకే మేం వచ్చాం!"

"అలాగా, సరే! వాణ్ణి యీ సాయంత్రం సూర్యాస్తమయం వేళకు ఏదో వంక పెట్టి సముద్రతీరానికి తీసుకురండి. తరవాత



పని నేను చూసుకుంటాను. ఇదిగో వాడికి నేనివ్వదలుచుకున్న ఖరీదు," అంటూ సరంగు వంద మొహరీలు జీవదత్తుడికి యివ్వబోయాడు.

జీవదత్తుడు, సరంగు యివ్వచూపిన డబ్బు తీసుకోకుండా: "అయ్యా, వాణ్ణి మేము సముద్రతీరానికి తీసుకురాగలగడం సాధ్యమయే పని కాదు. వాడిలో వంద నక్కలకుండే జిత్తులూ, ఎనభై ఎనుబోతుల బలమూ వుంది. కనక, మీరే యీ రాత్రికి మా యింటికి వచ్చి వాణ్ణి ఎలాగో చేజిక్కించుకోండి," అన్నాడు.

జీవదత్తుడి భయం చూసి సరంగు బిగ్గరగా నవ్వాడు. "వాడి జిత్తులూ, ఎనభై ఎనుబోతుల బలమూ నా దగ్గిర ఉప్పు గల్లుకూ కూడా మారవు. ఆఖరికి రాక్షసుణ్ణయినా, కంటికి కనబడి, చేతికి అందితే, కాళ్ళకూ మెడకూ ఇనపగొలుసులు తగిలించి, నా ఓడలో కళాసుపని చేయిస్తాను. సరే, రాత్రికి మరిద్దరు కళాసుల్ని వెంటబెట్టుకుని మీ యింటికి వస్తాను. మీ యిద్దరూ సర్వసిద్ధంగా వుండండి," అన్నాడు.

"వెయ్యి నమస్కారాలు. మీ సహాయానికి చాలా కృతజ్ఞులం!" అంటూ జీవదత్తుడూ, లక్షదత్తుడూ ఓడసరంగు యిచ్చిన నూరు మొహరీలూ తీసుకుని, పట్టరాని ఆనందంతో యింటికి బయలు దేరారు.

"ఇప్పుడు మనం పింగళుడికి అనుమానం కలక్కుండా వుండే విధంగా ఏదైనా యుక్తి పన్నాలి. సరంగు మరిద్దరు కళాసుల్ని వెంటపెట్టుకుని మనింటికి రావటం వాడికి అనుమాన కారణం కావొచ్చు!" అన్నాడు లక్షదత్తుడు.

"ఓఁ, అలాంటి భయం ఏమీ లేదు. దానికి అవసరం అయిన ఉపాయం ముందే ఆలోచించి వుంచాను," అంటూ జీవదత్తుడు ఓసారి చుట్టూ కలయచూసి, లక్షదత్తుడి చెవిలో రహస్యంగా ఏదో చెప్పాడు.

లక్షదత్తుడు పెద్దగా నవ్వుతూ చప్పట్లు చరిచి, గంతులేస్తూ, "అన్నా, నువ్వు బుద్ధికి బృహస్పతిని మించినవాడివి, నాకు తెలుసు! పింగళుడు తెచ్చిన డబ్బు మనదయినప్పుడు, భాగాల్లో నాకేమీ అన్యాయం చేయవుగదా?" అన్నాడు.

"అన్యాయమా, ఛఛ, సోదరుణ్ణి చూస్తూ చూస్తూ ఎలా మోసపుచ్చుతానురా? అది మన వంశంలోనే లేదుగదా!" అన్నాడు జీవదత్తుడు.

అన్నదమ్ము లిద్దరూ నవ్వుతూ, కేరింతలు కొడుతూ యింటిని సమీపించి, వాకిట్లో పింగళుణ్ణి చూడగానే, ముఖాల మీద ఎక్కడలేని విచారాన్ని తెచ్చిపెట్టుకుని అతణ్ణి సమీపించారు.

పింగళుడు వాళ్ళ వాలకం చూసి, "అన్నల్లారా, ఎందుకు అంత విచారంగా వున్నారు? ఏం జరిగింది?" అని అడిగాడు.

జీవదత్తుడు బొంగురుపోయిన గొంతు పెట్టి, "మరేం లేదు, తమ్ముడూ! ఇవ్వాళ దారంట వస్తూంటే మా పాత స్నేహితుడు ఒక ఓడసరంగు కనిపించాడు. అతడు ఈ పట్టణానికి ఏదో వ్యాపారం మీద వచ్చాడట. లోగడ అతడు మా ఇద్దరికీ అనేకసార్లు తన విడిదిలో ఆతిథ్యం యిచ్చి ఎంతో గౌరవించాడు. కాని, బదులుగా అతడికి ఈనాటివరకూ మేము ఆతిథ్యం ఇవ్వలేకపోయాం. మేము పుట్టుదరిద్రులం గదా?" అన్నాడు.



"అన్నా, మీ స్నేహితుడు నా స్నేహితుడు కాకుండా పోతాడా? మనం ఇప్పుడు దరిద్రులం ఏమీ కాదు. కావాలంటే అవంతీనగరంలో వున్న ప్రతి ఒక్కరికీ మనం రోజూ సంతర్పణ చేయగలం. మీ స్నేహితుడైన ఓడసరంగును అనుచరులతో కూడా, ఈ రాత్రి మన యింటికి విందుకు ఆహ్వానించండి! కావాలంటే విడిది కూడా యిక్కడే ఏర్పాటు చేద్దాం." అన్నాడు పింగళుడు.

"నిజమా, తమ్ముడూ నిజమా?" అంటూ అన్నలిద్దరూ ఎక్కడలేని సంతోషాన్ని నటిస్తూ పింగళుణ్ణి ప్రశ్నించారు.

"నిజం, మీ స్నేహితుణ్ణి తప్పక తీసుకురండి. మన ఇంట్లో మంచి విందు ఏర్పాటు చేద్దాం!" అన్నాడు పింగళుడు సంతోషంగా.

"సరే, అయితే ఇప్పుడే ఈ సంగతి మా స్నేహితుడితో చెప్పివస్తాం!" అంటూ జీవదత్తుడూ, లక్షదత్తుడూ తిరిగి పట్టణంలోకి బయలుదేరారు.

వాళ్ళిద్దరూ సూర్యాస్తమయం వరకూ జూదగృహాల్లోనూ, పానశాలల్లోనూ కాలం గడిపి, చీకటి పడగానే సరంగు విడిదికి వెళ్ళి, అతణ్ణి బయలుదేరమన్నారు. సరంగు చాలా సంతోషించి, బలశాలులైన ఇద్దరు కళాసుల్ని వెంటబెట్టుకుని అన్నదమ్ముల వెంట బయలుదేరాడు.

సరంగుకూ, అతడి అనుచరులకూ పింగళుడు హృదయపూర్వకమైన





స్వాగతం యిచ్చాడు. వాళ్ళందరూ ఒక గదిలో సుఖాసీనులైన తరవాత పింగళుడూ, తల్లీ కలిసి మహత్తుగల సంచి నుంచి రకరకాల పదార్థాలూ, పానీయాలూ తీసి వాళ్ళకు వడ్డించారు. సరంగుకు మాత్రం సంచీని గురించిన రహస్యం ఏమీ తెలియదు. జీవదత్తుడూ, లక్షదత్తుడూ తన కిలాంటి మర్యాదలు చేస్తున్నారని అతడు భావించాడు.

రాత్రి బాగా పొద్దుపోయేవరకూ అందరూ కులాసాగా కబుర్లాడుతూ కాలం గడిపారు. పింగళుడు నిద్రమత్తుతో జోగుతున్నప్పుడు, హఠాత్తుగా మీద పడి అతణ్ణి బంధించి పట్టుకుపోవాలని సరంగు ఎత్తు వేశాడు. కానీ, ఎంతకీ పింగళుడు నిద్ర మత్తు లక్షణాలు కనబరచక, ఎంతో ఉత్సాహంగా కథలూ, కబుర్లూ చెప్పేస్తున్నాడు.

ఇక యిలా కాలం వృథాపుచ్చటం మంచిది కాదని నిర్ణయించుకుని సరంగు తన అనుచరులకూ, జీవదత్తుడికీ లక్షదత్తుడికీ సౌజ్ఞచేశాడు. వెంటనే అందరూ మూకవుమ్మడిగా పింగళుడి మీద పడ్డారు. కొందరు అతడి కాళ్ళూ చేతులూ కదలకుండా పట్టుకున్నారు. జీవదత్తుడూ, లక్షదత్తుడూ అతడు కేకలు పెట్టకుండా నోట్లో గుడ్డముక్కలు కుక్కారు.

పింగళుడు మొదట ఆశ్చర్యపడి నిశ్చేష్టుడయినా, ఆ వెంటనే తెప్పరిల్లి, తనను బంధించేవాళ్ళ నుంచి విడిపించుకునేందుకు గట్టి ప్రయత్నం చేశాడు. కాని తాను ఒకడు, తనను బంధించ చూసేవాళ్ళు అయిదుగురు! వెంటనే అతడికి తన సేవకుడైన భల్లూకకేతుడు గుర్తుకు వచ్చాడు. ఎలాంటి కష్టంలో వున్నా సరే, ఒకానొక మంత్రం ఉచ్చరిస్తే తను మరు నిమిషాన సహాయానికి వస్తానని, అతడు పింగళుడికి ఒక మంత్రం చెప్పి వున్నాడు. కాని, ఆ కష్టసమయంలో ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా, ఆ మంత్రం పింగళుడికి స్ఫురించలేదు.

అతడు నిస్సహాయంగా అన్నల కుట్రకు లోనై, ఓడసరంగుకు బానిసగా చిక్కి పోయాడు.

పక్కగదిలో నిద్రిస్తున్న తల్లికి యివేమీ తెలియవు. పింగళుణ్ణి కాళ్ళూ, చేతులూ కట్టిం తరవాత కళాసులు యిద్దరూ కలిసి అతణ్ణి దుంగలాగా భుజం మీద వేసుకుని తమ యజమాని సరంగు వెనక బయటికి నడిచారు. జీవదత్తుడూ, లక్షదత్తుడూ కూడా వాళ్ళ వెనక సముద్రతీరం వరకూ వెళ్ళి, ఓడ సరంగుతో, "అయ్యా, మావాణ్ణి మాత్రం ఎట్టి పరిస్థితులలోనూ వదల కండి. వాడు విషసర్పం! ఆ సంగతి మీకు లోగడే మనవి చేసుకున్నాం గదా?" అన్నారు.

"విషసర్పం నోరు బిగించాం. ఇక ఆ కోరలు లేకుండా చేయటం ఎలాగో కూడా నాకు తెలుసు. నా పడవలో ఒకసారి తెడ్డువేసే యినప కమ్మీకి అతణ్ణి గొలుసుతో బిగించానంటే, ఆ పరమేశ్వరుడు కూడా అతణ్ణి అక్కడ నుంచి కదిలించ లేడు," అన్నాడు సరంగు.

జీవదత్తుడూ, లక్షదత్తుడూ సరంగుకు ఒకటికి రెండుసార్లు కృతజ్ఞత చెప్పుకుని యింటికి వచ్చారు. అప్పటికి యింకా తెల్లవారనందున కాసేపు నిద్రపోతున్నట్టు నటించి, తెల్లవారగానే ఆదుర్దాగా తల్లి




వద్దకు వెళ్ళి ఆమెను నిద్రలేపి, "అమ్మా, పింగళు డెక్కడ?" అని అడిగారు.

తల్లి వాళ్ళకేసి అమాయకంగా చూసి, "ఏం, ఎందుకంత ఆదుర్దాపడుతున్నారు? వాడి గదిలో నిద్రపోతున్నాడేమో చూడండి," అన్నది.

"గదిలో లేడు. ఇంట్లో మరెక్కడా వున్న జాడ కూడా లేదు," అన్నాడు జీవదత్తుడు.

ఆ మాటలతో తల్లికి ఎక్కడలేని భయమూ పట్టుకున్నది. ఆమె హడావిడిగా మంచంలోంచి లేచి యిల్లంతా కలయ వెతికింది. ఆమె ఆదుర్దా గమనించిన జీవదత్తుడు, "అమ్మా, నా కొక అను

మానం కలుగుతున్నది. తమ్ముడు రాత్రి మన యింటికి వచ్చిన ఓడసరంగుతో కలిసి సముద్ర ప్రయాణానికి వెళ్ళి వుంటాడేమో !'' అన్నాడు అమాయకంగా.

''అంతే జరిగి వుండొచ్చు. ఏదో ఒక ద్వీపంలో పెద్ద పాడుబడిన కోటలు వున్నాయనీ, వాటి పునాదుల్లో గొప్ప నిధులు వున్నాయనీ సరంగు మనవాడితో చెపుతున్నాడు. అలాటివాటిని బయటికి లాగటంలో నాది అందెవేసిన చేయి, అని పింగళుడు అంటున్నాడు,'' అన్నాడు లక్షదత్తుడు.

అమాయకురాలైన తల్లికి యిందులో కొంత సత్యం వున్నట్టు తోచింది. ఆమె నిస్పృహగా చేతులు జోడించి, ''అవును, నాయనలారా ! పింగళుడు ఎప్పుడూ అదృష్టవంతుడే ! వాడి న్యాయబుద్ధీ, సన్మార్గవర్తనే వాణ్ణి అన్ని ఆపదలనుంచీ కాపాడుతుంది. నా తండ్రి త్వరలోనే తిరిగివస్తాడు !'' అంటూ దేవుణ్ణి ప్రార్థించింది.

తల్లి ప్రవర్తన దుష్టులైన కొడుకులిద్దరికీ పట్టరాని ఆగ్రహం తెప్పించింది. వాళ్ళు తల్లికేసి వికటంగా నవ్వి, ''వాడు బుద్ధిమంతుడూ, మేము దుష్టులమూనన్న మాట ? మొదటినుంచీ నువ్వు వాడి మీద పక్షపాతం కనబరుస్తున్నావని మాకు తెలుసు. ఇక యీ యింట్లో మేం క్షణం వుండం. నాన్న వదిలిపోయిన ఆస్తి ఎక్కడ వుందో వెతికి ఎత్తుకుపోతాం,'' అంటూ బయలుదేరారు.

తల్లి వాళ్ళను వారిస్తూ, ''మీ నాన్న సంపాయించిన ఆస్తి యావత్తూ, మీరు ఎప్పుడో తగలవేశారు. ఈ యింట్లో యిప్పుడున్న దబ్బంతా పింగళుడు కష్టించి సంపాయించుకున్నదే,'' అన్నది.

ఆ మాటల్తో అన్నదమ్ము లిద్దరూ ఉగ్రులైపోయి, తల్లిని నానా తిట్లూ తిట్టి, పింగళుడు మహా మంత్రవేత్త అయిన పద్మపాదుడి నుంచి తెచ్చి దాచిన ధనమూ, మహత్తుగల సంచీ వెతికి బయటకి లాగారు. —(ఇంకావుంది)






# శ్రావణుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి, భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, ఈ భయంకరమైన శ్మశానంలో, యింత రాత్రివేళ నువ్వు పడుతున్న శ్రమ అంతా వృథా అయ్యే అవకాశం లేకపోలేదు. అలా జరిగిననాడు, నువ్వు ఎవరి మీద ఆగ్రహించీ ప్రయోజనం వుండదు. అంతా స్వయంకృతం అని సరిపెట్టుకోవలసి వస్తుంది. ఇందుకు ఉదాహరణగా నీకు, శ్రావణు డనే కవి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను,'' అంటూ యిలా చెప్పసాగాడు :

కాంభోజ దేశాన్ని చంద్రపాలు డనే రాజు పాలిస్తూండేవాడు. ఆయన చాలా దయాగుణం కలవాడు. సహాయం కోరి

## బేతాళ కథలు



వచ్చిన వారికి లేదనకుండా, ఎంతో కొంత ధన సహాయం చేస్తూండేవాడు. ఆయన ఆస్థానంలో కవి పండితులు చాలామంది వుండేవారు. రోజూ సాయం సమయాల్లో కవితాగోష్ఠి జరుగుతూండేది.

ఒకనాడు శ్రావణు డనే కవి రాజాశ్రయం కోరి వచ్చి, చంద్రపాలుడి మీద ఆశువుగా కవిత్వం చెప్పాడు. అది విని ఆయన చాలా ఆనందించి, శ్రావణుడికి తన ఆస్థానంలో మంచి వేతనం మీద ఉద్యోగం యిచ్చాడు.

మర్నాటి నుంచి శ్రావణుడు సభకు రాసాగాడు. సాయం సమయాల్లో కవులు తమ కావ్యాలు వినిపిస్తూంటే, పండితులు చర్చలు జరుపుతూంటే ఉత్సాహంగా వింటూండేవాడు, చంద్రపాలుడు. కాని, కొత్తగా వచ్చిన శ్రావణుడికి, తన తోటి కవుల కవిత్వంలో అనేక అసందర్భాలూ, శబ్దదోషాలూ కనిపించసాగాయి. సభా ప్రవేశం చేసిన తొలి రోజుల్లోనే, వారిని ఖండిస్తూ మాట్లాడడం బావుండదని, శ్రావణుడు కొంతకాలం సహించాడు. కాని, రాను రాను వారి దోషపూరితమైన విద్వత్తు, అతడికి భరించరానిదయింది.

అయితే, రాజు చంద్రపాలుడు వాళ్ళ కవిత్వాన్నీ, చర్చలనూ విని ఆనందించుతూండడం, శ్రావణుడికి చాలా ఆశ్చర్యం కలిగించింది. కాని, అతడికి ఒక అనుమానం కూడా కలగకపోలేదు. ఒకవేళ చంద్రపాలుడు, ఆ కవి పండితులను నిరాశ్రయుల్ని చేయడం యిష్టంలేక, వాళ్ళను భరిస్తున్నాడా?

శ్రావణుడు వాళ్ళ స్థితిగతుల్ని గురించి విచారించగా, ఏ ఒకరిద్దరో తప్ప, మిగతా వాళ్ళందరూ రాజాశ్రయం లేకపోయినా సుఖంగా జీవించే స్థితిలోనే వున్నట్టు తెలిసింది.

అప్పుడు శ్రావణుడికి, రాజు తెలివితేటల మీదా, తన కవితా పటిమ మీదా అనుమానం కలిగింది. చంద్రపాలుడు రోజూ కవిత్వం వినడమేతప్ప, స్వయంగా

ఏనాడూ కవిత్వం చెప్పలేదు. పండితుల చర్చలు విని ఆనందించడమేగాని, వాళ్ళ గోష్ఠిలో పాల్గొనలేదు.

ఆ తరుణంలో, శంకరానందు డనే పండిత శ్రేష్ఠుడు కాశీ నుంచి కాంభోజ పొరుగు దేశమైన కోసలకు వెళుతూ, నగరంలో ఒకరోజు విడిది చేయడం జరిగింది. శ్రావణుడు ఆయన దర్శనం చేసుకుని, తన కవిత్వం వినిపించి, "కవిగా నన్ను నేను యింకా అభివృద్ధి పరుచుకునేందుకు, మీ దగ్గరకు వచ్చాను. ప్రస్తుతం రాజాస్థానంలో వుంటున్నాను. కవిగా, నా అంతస్తు గురించి తమ అమూల్యాభిప్రాయం తెలియజేయండి," అని కోరాడు.

శంకరానందుడు చిరునవ్వు నవ్వి, "నీకు రాజాశ్రయం దొరికిందా? అది కవిగా కాక, వ్యక్తిగా, నీ అదృష్టం! నాయనా, నువ్వు కవి అనిపించుకునేందుకు ఎంతో కృషి చేయవలసి వున్నది," అన్నాడు.

శ్రావణుడు, శంకరానందుడికి తన కృతజ్ఞత చెప్పుకుని తిరిగి వచ్చి, చంద్రపాలుడి మంత్రి అయిన విశాలుణ్ణి చూడబోయి, "అయ్యా, కవిగా నాకున్న అతి స్వల్పమైన పాండిత్యాన్ని మెచ్చుకుని, రాజుగారు తమ ఆస్థానంలో చోటు యిచ్చినందుకు చాలా కృతజ్ఞుణ్ణి. నేను యింకా విద్యాభ్యాసం చేయదలచి కాశీ వెళ్ళబోతున్నాను. నాకు శెలవిప్పించ కోరుతాను," అన్నాడు.





బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, శ్రావణుడు తన మీద ఆశువుగా చెప్పిన ఒక్క పద్యానికే మెచ్చి, రాజు అతడికి ఆస్థానంలో చోటు కల్పించాడు. ఇలా దొరికిన మంచి అవకాశాన్ని అతడు జార విడుచుకోవడం అవివేకం వల్లనేకదా? ఇది కేవలం స్వయంకృతం; సభలో ఏ కవిపండితుణ్ణీ నిందించి ప్రయోజనం లేదు. వాళ్ళు తమకున్న విద్వత్తుతో సుఖంగా బతికిపోతున్నారు. మరొక సంగతి; కవి కావడానికి శ్రావణుడు యింకా ఎంతో కృషి చేయవలసి వున్న దని శంకరానందుడు అన్నాడు. అటు వంటివాణ్ణి మంత్రి విశాలుడు చాలా తెలివైనవాడంటూ పొగిడాడు. ఇలా అన డంలో మంత్రి ఉద్దేశం ఏమిటి? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "శ్రావణుడు మంచి తెలివిగల వాడనడంలో సందేహం లేదు. కాని, యిక్కడ మనం కథా సందర్భాన్నిబట్టి ముఖ్యంగా చూడ వలసింది, అతడేపాటి కవి అన్నది. శంకరానందుడు అతడికి కవిగా రాజా శ్రయం దొరికిందని విని ఆశ్చర్యపడ్డాడు. అతణ్ణి కవిగా కాక, వ్యక్తిగా అదృష్ట

మంత్రి శ్రావణుడి ముఖంకేసి ఒకసారి పరీక్షగా చూసి, "శ్రావణా, నువ్వు కేవలం మర్యాద మన్ననలు తెలిసిన వాడివే కాక, చాలా తెలివిమంతుడివి కూడా. అటువంటి నీవు, నీకు ఆశ్రయం యిచ్చిన రాజుగారికిగాక, నాకు వీడ్కోలు చెప్పడం ధర్మం కాదు," అన్నాడు.

ఆ మాటలకు శ్రావణుడు చిరునవ్వు నవ్వి, "అయ్యా, తమకా సందేహం అక్కరలేదు. రాజుగారి ఆదరాభిమానా లను మరిచిపోయి, వేరుగా ప్రవర్తించేంత కృతఘ్నుణ్ణి కాను," అన్నాడు.

తర్వాత శ్రావణుడు, రాజు కూడా వీడ్కోలు చెప్పి వెళ్ళిపోయాడు.

వంతుడివని చెప్పి, కవిత్వ విషయంలో ఎంతో కృషి చేయవలసి వున్నదని సలహా యిచ్చాడు. శ్రావణుడు జ్ఞానదాహం కల వాడు. తనను తాను అభివృద్ధిపరచుకోవా లనుకునే వాడికి, అతడి గుణదోషాలను ఎత్తి చూపే వ్యక్తులు అవసరం. చంద్ర పాలుడి ఆస్థానంలో అటువంటి వారు ఎవరూ అతడికి కనిపించలేదు. అతడి రసహీనమైన కవిత్వాన్నే విని, చంద్ర పాలుడు చాలా ఆనందపడ్డాడు. అలాంటి రాజాస్థానంలో వుంటే శ్రావణుడు ఏనాటికీ నిజమైన కవి కాలేడు. అందువల్లనే అతడు మరొకచోటుకు వెళ్ళి పోవాలనుకున్నాడు.

రాజు చంద్రపాలుడు అంతగా తెలివి తేటలూ, వివేకం కలవాడు కాదన్న అను మానం, శ్రావణుడికి కలిగింది. ఆ మాటే నిజమైతే, రాజ్యపాలన సక్రమంగా సాగ డానికి వెనక వుండి చక్రం తిప్పుతున్నది, మంత్రి విశాలుడై వుండాలి. అందుకే, శ్రావణుడు విశాలుణ్ణి కలుసుకుని, కృత జ్ఞతలు చెప్పి వీడ్కోలు తీసుకున్నాడు. ఇన్ని ఊహించినవాణ్ణి మంత్రి తెలివైన వాడివని పొగడడంలో ఆశ్చర్యం లేదు.

నీకు ఆశ్రయం యిచ్చిన రాజుగారికి కాక, నాకు వీడ్కోలు చెప్పడం ధర్మం కాదు—అని మంత్రి అనడంలో హెచ్చ రికతోపాటు, ఒక సూచన కూడా వున్నది. అదేమిటంటే, రాజు చంద్రపాలుడి అజ్ఞా నాన్ని ఎక్కడా బయటపెట్టవద్దని. శ్రావణుడు సూక్ష్మగ్రాహి. అందువల్లనే అతడు మంత్రితో—రాజుగారి ఆదరాభి మానాలు మరిచిపోయి, వేరుగా ప్రవర్తిం చేంత కృతఘ్నుణ్ణి కాను, అన్నాడు.

రాజు చంద్రపాలుడు అంతగా తెలివి గలవాడు కాకపోవచ్చు; కాని, గొప్ప ఉదారవంతుడు. ఆ సంగతి శ్రావణుడికీ, మంత్రికీ బాగా తెలుసు. రాజుపట్ల వారి ప్రవర్తనలో కనిపిస్తున్న భేదం, వారి వారి స్థానాలకు అనుగుణమైనది,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగంకలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# నియమాలు తప్పినవాడు

వింధ్యపర్వత ప్రాంతాల్లోని ఒకానొక సరస్సు తీరాన గురుకులం ఒకటుండేది. మాతంగస్వామి అనే మహాపండితుడు దాన్ని నడుపుతూండేవాడు. ఆయన గురుకులంలో, గొప్ప సంపన్నులైన కుటుంబాల నుంచి వచ్చిన అనేకమంది కుర్రవాళ్ళు చదువుకుంటూండేవాళ్ళు. వాళ్ళల్లో విరూపుడనేవాడు, ఆ దేశాన్నేలే రాజు గారి బావమరిది కుమారుడు.

విరూపుడు కొంచెం పెంకెగా ప్రవర్తిస్తూ, గురుకుల నియమాలను ఉల్లంఘిస్తూండేవాడు. మాతంగస్వామి కుడికాలు కొంచెం కుంటి. ఇది అవకాశంగా తీసుకుని విరూపుడు తోటివాళ్ళ దగ్గిర ఆయనను కుంటిస్వామి అంటూండేవాడు. ఈ సంగతి మాతంగస్వామికి తెలిసింది.

అయన ఒకనాడు శిష్యులకు పాఠాలు చెప్పడంఅయ్యాక.ఒకకథయిలాచెప్పాడు:

ఇప్పటికి దాదాపు యాభైఏళ్ళ క్రితం, సరస్సుకు అవలితీరంలో ఖైరవానందుడనే విద్యావేత్త గురుకులం ఒకటి నడుపుతూండేవాడు. అయన . అన్ని శాస్త్రాలతో పాటు మంత్రశాస్త్రంలో కూడా గొప్పనిధి. తన శిష్యుల విద్యాభ్యాసం పూర్తి అయాక, కోరినవారికి మంత్రశాస్త్రంలో కూడా ప్రవేశం కల్పించేవాడు.

ఒకసారి సుభానుడు, మతంగుడు అనే యిద్దరు శిష్యులు విద్య ముగిసిన తరవాత, ఆయనను మంత్రశాస్త్రపరంగా ఏదైనా ఉపదేశం చేయమని కోరారు. అందుకు ఖైరవానందుడు సరేనని, వాళ్లకు ఒక మంత్రం ఉపదేశించి, ''నాయనలారా, యీ మంత్రం ద్వారా మీరు కోరిన రూపాలను ధరించగలరు. అయితే, యిందుకు కొన్ని నియమ నిబంధనలు ఉన్నవి. అత్యవసరం అయినప్పుడే, మీరీ

గుంటక సాంబిరెడ్డి

మంత్రాన్ని ఉపయోగించాలి. కేవలం మంత్రశక్తిని పరీక్షించడం కోసమో, ఉబుసుపోకో మాత్రం దీనిని ఉపయోగించరాదు. ఏ కారణం వల్లనైనా అంగ వైకల్యం కలిగితే, యీ మంత్రం పని చెయ్యదు,'' అని చెప్పాడు.



శిష్యులిద్దరూ గురువుగారి దగ్గిర సెలవు తీసుకుని, రాజాస్థానంలో ఉద్యోగ ప్రయత్నం చేద్దామని, రాజధానీనగరానికి బయలుదేరారు. దారిలో వారొక నది దాటవలసి వచ్చింది. వాళ్ళు అక్కడికి చేరేప్పటికి నది దాటించే పడవవాడు, అవతలి ఒడ్డున వున్నాడు.

అప్పుడు మతంగుడు, సుభానుడితో, ''ఆ దరినుంచి వచ్చే మనుషులు దొరికితే గాని, పడవవాడు యీ దరికి రాడు. మన గురువుగారు ఉపదేశించిన మంత్రం వున్నది గదా? మనం చేపలరూపాలు ధరించి, నదిలో ఈదుతూ అవతలి ఒడ్డు చేరుకుందాం,'' అన్నాడు.

''కేవలం మంత్రశక్తిని పరీక్షించడం కోసం, దానిని ఉపయోగించవద్దని గురువు గారు నియమం పెట్టారు!'' అన్నాడు సుభానుడు.

ఈ జవాబుకు మతంగుడు విసుక్కుని, ''అలా అయితే, నువ్వు పడవలోనేరా. నేను మాత్రం చేపరూపంతో నది దాటు తాను,'' అని, చేపరూపం ధరించి నది అవతలి ఒడ్డుకు చేరాడు.

కొంతసేపటికి సుభానుడుపడవలో నది దాటి మతంగుణ్ణి కలుసుకున్నాడు. అక్కడి నుంచి కాలినడకన రాజధాని వెళ్ళడం చాలా శ్రమగా తోచింది, మతంగుడికి.

''మనం ఏ పక్షిరూపమో ధరించి రాజధాని చేరడం బావుంటుంది కదా?'' అన్నాడు మతంగుడు, సుభానుడితో.

ఇందుకు సుభానుడు ఒప్పుకోలేదు. మతంగుడు అతణ్ణి అవివేకి కింద జమకట్టి, వెంటనే పావురం రూపం ధరించి, ఆకాశంలోకి ఎగిరాడు. అతడలా ఆకాశంలో కొంతసేపు ప్రయాణించి అలసట

తీర్చుకునేందుకు ఒక చెట్టు కొమ్మపై వాలాడు. డేగ ఒకటి ఆకాశంలో తిరుగుతూ, చెట్టుకొమ్మ మీద పావురం రూపంలో వున్న మతంగుణ్ణి చూసి, రివ్వుమంటూ వచ్చి దాన్ని గోళ్ళతో పట్టి, తిరిగి ఆకాశం లోకి పోయింది. డేగ బారినుంచి తప్పించు కునేందుకు మతంగుడు మనిషిగా మారాడు.

తన గోళ్ళ మధ్య చిక్కిన పావురం మనిషిగా మారడం చూస్తూనే, డేగ బెదిరి పోయి దాన్ని వదిలివేసింది. మతంగుడు చాలా ఎత్తు నుంచి దిగువనున్న పొదల మీద పడ్డాడు. ఆ కారణం వల్ల అతడికి ప్రాణాపాయం కలగలేదుగాని, ఒళ్ళంతా దెబ్బలు తగిలి, కుడికాలు విరిగింది.

ఆ దారిన పోతున్న తీర్థయాత్రికుల సాయంతో మతంగుడు కొన్నాళ్ళకు, గురువైన భైరవానందుణ్ణి చేరి, జరిగినదంతా చెప్పి, దుఃఖించసాగాడు.

భైరవానందుడు అతణ్ణి ఓదార్చి, విరిగిన కాలుకు ఎన్నో చికిత్సలు చేశాడు. అందువల్ల గాయం నయమయిందే తప్ప, మతంగుడి కుంటితనం మాత్రం పోలేదు. ఈ అంగవైకల్యం వల్ల గురువు ఉపదేశించిన మంత్రం పనికి రాకుండా పోయింది. సుభానుడు మాత్రం రాజాస్థానంలో ఉద్యోగం సంపాయించి, కాలక్రమాన ముఖ్య విద్యాశాఖాధికారి అయ్యాడు.

మాతంగస్వామి కథ చెప్పడం ముగించి, "గురువు పెట్టిన నియమాలు పాటించనందున, మతంగుడు కుంటి వాడు కావడంతోపాటు, మంత్రం ద్వారా తనకు లభించిన అపూర్వశక్తులను కూడా పోగొట్టుకున్నాడు. ఆనాటి మతంగుణ్ణి, నేనే! గురువుపట్ల భక్తి గౌరవాలు లేని వాడు ఎన్నటికీ విద్యావంతుడు కాలేడు," అని చెప్పి, కుంటుకుంటూ తన కుటీరం లోకి వెళ్ళాడు.

ఆ తరవాత విరూపుడెన్నడూ గురుకుల నియమాలను ఉల్లంఘించలేదు. మాతంగ స్వామిని తోటి విద్యార్థుల దగ్గిర కుంటి స్వామి అని పిలవలేదు.






# గడుసు పెళ్ళాం

ఒక ఊళ్ళో ఒక సంసారి ఉండేవాడు. అతను పెళ్ళి చేసుకున్న మనిషి చాలా గడుసుది. మొగుడు మెత్తనివాడు కావటంతో ఆమె మరింత కొరకరాని కొయ్య అయింది.

భార్య కాపరానికి వచ్చిన కొత్తలో భర్త అచ్చగా మగపనులే చేసేవాడు. కాని రాను రాను ఆడపనులు కూడా ఒక్కొక్కటే అతని పైన పడసాగాయి. అతని భార్య పొలం పనిలో ఆవగింజంత అయినా సహాయపడకపోగా ఇంటి పనులు కూడా అతనికే అంటగట్టింది. ఆవులనూ, మేకలనూ అతనే చూడాలి. చివరకు నీళ్ళు తేవటమూ, కసువు ఊడ్చటమూ, బట్టలు ఉతకటమూ, పొయ్యి రాజెయ్యటమూ కూడా అతనిపైనే పడ్డాయి.

ఇంత కష్టపడి అడ్డమైన చాకిరీ చేస్తున్నా అతని భార్య అతన్ని రోజల్లా దుమ్మెత్తి పోస్తూనే ఉండేది. అతను చేసిన పనికీ, చేయని పనికీ తప్పు పట్టేది. భార్య పెట్టే శాపనార్థాలు వినటానికిగాను కాస్సేపు నిలబడటానికైనా అతనికి తీరిక ఉండేది కాదు. అందుచేత, అతను పనులమీద అటూ ఇటూ తిరుగుతూంటే, భార్య ఒకచోట నిలబడి, అతనికి వినపడేలాగా గొంతెత్తి, "నీకు ఒక్క పనీ చేతగాదు! ఏది ముందు చెయ్యాలో ఏది వెనక చెయ్యాలో తెలీదు! ఇంత చేతగాని మొగుడితో నేనెట్లా కాపరం చేసేదంట!" అని చుట్టుపక్కల కోసు దూరం వినపడేటట్టు కేకలు పెట్టేది.

భార్య ఇంత చేస్తున్నా ఆ మానవుడు నోరెత్తక అన్నీ పడేవాడు. అతనికి అటువంటి భార్యతో ఘర్షణపడటం ఎంత మాత్రం ఇష్టం లేదు. అందరూ తనని చూసి నవ్వుకుంటున్నారని అతనికి




తెలుసు. అతను తన మిత్రులతో, ''ఎందుకు నవ్వుతారు? నవ్విన నాపచేనే పండుతుంది!'' అనేవాడు.

ఒక రోజు భార్య భర్తతో, ''పాలు కాస్తా విరిగాయి! నువ్వే పని సరిగ్గా చేశావు గనక?'' అన్నది నిష్ఠురంగా.

భర్త ఆశ్చర్యంతో, ''పాలు విరగటం కూడా నా తప్పే?'' అన్నాడు.

''పాలదుత్తను నువు పీచుపెట్టి తోమి ఉంటే పాలెందుకు విరుగుతాయి?'' అన్నది భార్య.

''ఇదుగో, పాలదుత్త దగ్గిర నుంచీ నేనే తోమాలని నాకు తెలీదు. ఇప్పుడే నువ్వు చెబుతున్నావు.'' అన్నాడు భర్త.

''ఎన్ని పనులని నేను చూసుకునేది. మగ దిక్కంటూ ఉన్నందుకు నాకు నీ సహాయం ఉండక్కర్లేదా ఏమిటి?'' అన్నది భార్య.

''అదంతా నాకు తెలియదు. నేను చెయ్యవలసిన పనులు ఏమేమిటో ఒక జాబితా రాసి ఇయ్యి! అవి చెయ్యకపోతే తప్పు పట్టు! ఇది నోటి మాటలతో తేలే వ్యవహారం కాదు,'' అన్నాడు భర్త.

అతను కాగితం మీద రాసుకుంటూంటే భార్య అతను చేయవలసిన పనులన్నీ చెప్పింది. అది కొండవీటి చేంతాడంత జాబితా అయింది.

కొద్ది రోజులు గడిచాయి. సంక్రాంతి వచ్చింది. రేపు పండగ అనగా భార్య తమ ఇంటి సమీపాన ఉన్న నీళ్ళగుంట దగ్గిర చాకిరేవు పెట్టింది. భర్త బట్టలు ఉతికి, పిండి, అందిస్తూంటే భార్య వాటిని ఆరవేస్తున్నది. ఈ పని చేస్తున్నంత సేపూ ఆమె భర్తను తిడుతూనే ఉన్నది: ''రేపే పండగ! మామూలు పనులే కాలేదు. ఇక పండగ పనులు ఏమవుతాయో! జాబితా రాసుకున్నావు, ఏం ప్రయోజనం? చాలామంది వాజలున్నారు గాని, నీ అంత పనికిమాలిన వాజను నేనెక్కడా చూడలేదు. మా అమ్మ ఏనాడో చెప్పింది—''

ఆమె మాట పూర్తి చెయ్యకమునుపే ప్రమాదం జరిగిపోయింది. ఆమె భర్త పిండిన బట్టను అందుకోవటానికి గుంట ఒడ్డున ఉన్న పాకుడురాయి మీద కాలు పెట్టింది. మొగుణ్ణి తిట్టే ఉద్రేకంలో ఆమె ఆ రాయిని సరిగా చూడలేదు. దాని మీద కాలు పెట్టిన మరుక్షణమే కాలు జారి నీళ్ళ గుంటలో పడిపోయింది.

''మునిగిపోతున్నాను! చచ్చిపోతున్నాను! పైకి లాగు!''- అన్నది భార్య.

''మునిగిపోవులే. గుంట లోతు లేదు. నీ మెడవరకే నీరున్నది!'' అన్నాడు భర్త.

''చలికి ఒళ్ళంతా బిగుసుకుపోతున్నది! వేగిరం నన్ను పైకి తియ్యి!'' అన్నది భార్య చలికి వణుకుతూ.

''అదెట్లా? జాబితాలో నేను చెయ్యవలసిన పనులు చాలా ఉన్నాయి. ఇది జాబితాలో లేని పని!'' అన్నాడు భర్త.

''నన్ను ముందు పైకి తీస్తావా, తియ్యవా? అమ్మయ్యో, జలగలు!'' అని భార్య చావుకేక పెట్టింది.

''మనం చేసుకున్న ఏర్పాటు అప్పుడే మరిచినట్టున్నావు. కావలిస్తే ఇప్పుడే ఇంటికి పోయి జాబితా తెచ్చి వినిపిస్తానుండు!'' అంటూ భర్త చిటికెలో జాబితా తెచ్చి చదవసాగాడు.

భార్య చలితోనూ, జలగల భయంతోను వణికిపోతూ హీనస్వరంతో, ''చచ్చిపోతున్నాను, ఆ జాబితా చించి పారేసి నన్ను దబ్బున బయటికి తీద్దూ, నీకు పుణ్యముంటుంది!'' అన్నది.

''ఆ మాట అన్నావు, బాగుంది! ఈ జాబితాతో ఇక మనకు పని లేదు. ఇక నుంచీ నువు ఆడపనులు చెయ్యి, నేను మగ పనులు చేస్తాను! అందుకు సమ్మతమేనా?'' అన్నాడు భర్త.

భార్య సరేనన్నది. భర్త ఆమెను గుంటలో నుంచి బయటికి లాగి ఇంట్లోకి తీసుకుపోయి చలిమంట వేశాడు. ఆ తరవాత భార్య అతన్ని ఎన్నడూ పల్లెత్తు మాట అనలేదు, తన పనులు అతనికి చెప్పలేదు కూడా.





# మానవజన్మ

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో బోధిసత్వుడు మగధరాజ్యంలో ఒక పేదవాడుగా జన్మించి, మగధరాజు పరివారంలో ఒకడుగా ఉంటూ ఉండేవాడు.

మగధదేశానికీ, అంగదేశానికీ మధ్యగా చంపానది ప్రవహిస్తూ ఉండేది. ఆ నది అడుగున నాగరాజ్యం ఉండేది. చంపేయ్యుడు ఆ రాజ్యానికి రాజు.

మగధరాజ్యానికీ అంగరాజ్యానికీ మధ్య ఎల్లప్పుడూ యుద్ధాలు సాగుతూండేవి. అలా జరిగిన ఒక యుద్ధంలో మగధరాజు ఓడిపోయాడు. ఆయన తన గుర్రం మీద ఎక్కి పారిపోతూ చంపానది వద్దకు వచ్చి, తన శత్రువు చేతికి చిక్కి చావటంకంటె ఆత్మహత్య చేసుకోవటం మంచిదనే ఉద్దేశంతో, తన గుర్రంతో సహా నదిలోకి ఉరికాడు. మగధరాజుతో సహా గుర్రం నది అడుగున వున్న నాగరాజు కొలువు కూటంలో వాలింది.

నాగరాజు తన సింహాసనం నుంచి లేచి వచ్చి మగధరాజుకు ఆదరపూర్వకంగా స్వాగతమిచ్చి, ఆయన కథ యావత్తూ తెలుసుకున్నాడు.

''జరిగినదానికి మీరు విచారించకండి. అంగరాజుతో జరిగే ఈ యుద్ధంలో మీకు విజయం లభించటానికి నేను తోడ్పడగలను,'' అని నాగరాజు తన అతిథికి మాట ఇచ్చాడు.

ఆ ప్రకారమే నాగరాజు మగధరాజుకు యుద్ధంలో సహాయపడ్డాడు. అంగరాజు మగధరాజు చేతిలో చనిపోయాడు. మగధరాజు రెండు దేశాలకూ రాజై వైభవంగా పరిపాలించసాగాడు.

అది మొదలు మగధరాజుకూ, నాగరాజుకూ బద్ధమైత్రి ఏర్పడింది. మగధ



రాజు ఏటా ఒక రోజున సపరివారంగా చంపానదీతీరానికి వెళ్ళేవాడు. ఆ రోజున నాగరాజు నది నుంచి అత్యంత వైభవంతో వెలువడి మగధరాజు తెచ్చిన బహుమానాలు అందుకునేవాడు.

మగధరాజు పరివారంలో ఒక భృత్యుడుగా ఉంటున్న బోధిసత్త్వుడు ఏటా నాగరాజు వైభవాన్ని కళ్ళారా చూస్తూ వచ్చాడు. ఆయన చనిపోయే క్షణాన ఈ నాగరాజు వైభవమే ఆయన మనసులో మెదిలింది. ఆ కారణంచేత ఆయన నాగరాజు చనిపోయిన ఏడవనాడు తానే నాగరాజుగా జన్మించాడు.

కాని కిందటి జన్మలో పుణ్యాత్ముడై ఉండిన కారణం చేత ఆయన కిప్పుడు తన పాము శరీరం చూసుకోగానే ఎంతో రోత పుట్టింది; నాగరాజు ఐశ్వర్యాన్ని కాంక్షించినందుకు ఆయనకు పశ్చాత్తాపం కూడా కలిగింది. ఆయన ఆత్మహత్య చేసుకుని ఈ జన్మ చాలింతామనుకుంటున్న సమయంలో సుమన అనే నాగకన్య తన చెలికత్తెలను వెంటబెట్టుకుని వచ్చి, ఆయనకు ప్రణామం చేసింది.

సుమనను చూడగానే నాగరాజు ఆత్మహత్యా ప్రయత్నం మానేసి, ఆమెను తన భార్యను చేసుకుని నాగలోకాన్ని పరిపాలించసాగాడు.

కాని కొంత కాలానికి ఆయనకు ఉపవాసాలూ, నిష్ఠలూ జరిపి, పుణ్యం సంపాదించుకోవాలనే కోరిక కలిగింది. ఇందుకుగాను ఆయన తన లోకాన్ని విడిచి మానవలోకంలోకి వెళ్ళ నిశ్చయించాడు. ఉపవాసదినాలు వచ్చినప్పుడాయన తన భవనం వెలువడి, ఒక రహదారి పక్కన ఉండే చీమలపుట్ట మీద చుట్ట చుట్టుకు పడుకుని, ''నన్ను ఏ గరుడపక్షి అయినా తన్నుకుపోనీ! ఏ పాములవాడైనా పట్టుకుపోనీ!'' అనుకునేవాడు.

కాని ఆయన అనుకున్నట్టు జరగలేదు. రహదారి వెంట వెళ్ళే మనుష్యులు పుట్ట మీద చుట్టుకుని ఉన్న పామును చూసి



దేవతగా భావించి, పూలతోనూ చందనం తోనూ పూజించసాగారు. ఆ సమీపాన ఉండే గ్రామానికి చెందినవారు కొందరు ఆ నాగరాజుండే పుట్టవద్ద ఒక ఆలయం కట్టారు. ప్రతిరోజూ అక్కడికి రకరకాల ప్రజలు వచ్చి పిల్లలు కావాలనీ, తమ శరీర వ్యాధులు నయం కావాలనీ, తమ కోరికలు తీరాలనీ మొక్కుకోసాగారు.

నాగరాజు ఉపవాసదినాలన్నీ యీ విధంగా పుట్ట మీద గడిపి ప్రతి మాసమూ కృష్ణపాడ్యమి నాడు యింటికి తిరిగి పోతూ ఉండేవాడు.

ఒకనాడు సుమన ఆయనకు, "స్వామీ, మీరు తరుచు మానవలోకంలోకి వెళుతున్నారు. ఆ లోకం అపాయకరమైనది, భయంకరమైనది. మీ కేదైనా ప్రమాదం జరిగే పక్షాన నాకా సంగతి తెలిసేదెలా?" అని అన్నది.

నాగరాజు సుమనను ఒక కొలను వద్దకు తీసుకుపోయి, "ఈ నీరు చూడు! నాకేదైనా దెబ్బ తగిలితే ఈ నీరు మురికి అవుతుంది. నన్నేదైనా గరుడపక్షి తన్నుకు పోతే ఈ నీరు ఇగిరిపోతుంది. అలా కాక, ఏ మంత్రగాడైనా నన్ను పట్టుకున్న పక్షంలో ఈ నీరు రక్తవర్ణంగా మారుతుంది," అని ఆమెతో చెప్పాడు.

కాశీనగరవాసి అయిన ఒక బ్రాహ్మణ యువకుడు తక్షశిలకు వెళ్ళి అక్కడ వశీకరణవిద్య నేర్చుకుని తన దేశానికి తిరిగిపోతూ నాగరాజు పడుకునే చోటికి రహదారి వెంబడి వచ్చాడు. పుట్టపైన చుట్టుకుని పడుకుని ఉన్న నాగరాజు అతని కంట పడ్డాడు. వెంటనే ఆ యువకుడు పామును మంత్రంతో బంధించి పట్టుకుని, ఒక బుట్టలో పెట్టి, ఒక గ్రామానికి తీసుకుపోయి, అక్కడ ఆ పామును ఆడించాడు.

ఇది చూడవచ్చిన గ్రామస్థులు పాము లాటకు చాలా సంతోషించి బ్రాహ్మణ యువకుడికి డబ్బూ, ఇతర విలువైన బహుమానాలూ ఇచ్చారు.

"ఈ కుగ్రామంలోనే ఇంత డబ్బు వస్తే ఇంక పట్టణాలలో పాము నాడిస్తే ఇంకా ఎంత వస్తుందో!" అని బ్రాహ్మణ యువకుడికి ఆశ కలిగింది.

అతను పామును వెంటతీసుకుని కాశీ నగరానికి బయలుదేరి, బండి మీద ప్రయాణం చేస్తూ, ఒక మాసానికల్లా కాశీ నగరాన్ని చేరుకున్నాడు.

ఈ నెల రోజులపాటూ నాగరాజు ఉప వాసాలు చేశాడేగాని, ఆహారంగా బ్రాహ్మణ యువకుడిచ్చిన కప్పలను తాకనేలేదు.

"నేను ఆహారం తిన్నంతకాలమూ నాకీ బుట్టలో మంత్రశక్తులున్న యీ యువకుడి వల్ల ఖైదు తప్పదు!" అని అయన తెలుసుకున్నాడు.

బ్రాహ్మణ యువకుడు నాగరాజును కాశీనగర సమీపాన గల అనేక గ్రామాలలో ఆడించి అక్కడి ప్రజలనుంచి అంతులేని డబ్బు సంపాదించాడు.

ఈ పాములాట వినోదం గురించి త్వరలోనే కాశీరాజుకు తెలియవచ్చింది. ఆయన బ్రాహ్మణ యువకుణ్ణి పిలిపించి తన వినోదం కొరకు పాములాట ఏర్పాటు చేయించాడు.

ఈలోపల నాగలోకంలో సుమన, నెల రోజులుగా తన భర్త ఇంటికి రాకపోవటం గమనించి ఏదో జరిగివుంటుందని భయపడి, నిజం తెలుసుకునేటందుకు కొలను వద్దకు వెళ్ళింది. కొలనులో నీరు ఎర్రగా, రక్తం రంగులో ఉన్నది. ఎవడో పాముల



వాడు తన భర్తను పట్టుకున్నట్టు సుమన తెలుసుకున్నది. ఆమె తన భర్తను వెతుక్కుంటూ బయలుదేరి, దారిలో విచారిస్తూ, త్వరలోనే కాశీనగరం చేరుకున్నది.

ఆమె అక్కడికి చేరేసరికి, పాములాట జరుగుతున్నది. రాజుగారూ, అనేకమంది ప్రజలూ చేరి వినోదం చూస్తున్నారు. తన భార్యను చూడగానే నాగరాజు సిగ్గుపడి, ఆట మాని, చప్పున బుట్టలోకి వెళ్ళిపోయాడు.

సుమన మానవ స్త్రీ రూపం ధరించి రాజును సమీపించి, చేతులు జోడించి, "మహారాజా, నాకు పతిభిక్ష పెట్టండి!" అని వేడుకున్నది.

ఇంతలోనే పాము కూడా బుట్టలో నుంచి బయటికి పాకివచ్చి, అందరూ చూస్తూండగానే, ఒక ఆకర్షణీయమైన యువకుడి ఆకారం ధరించింది.

కాశీరాజు ఆ నాగదంపతులను చూసి ఎంతో ముచ్చటపడి, వారిని వారం రోజులపాటు తన అతిథులుగా ఉంచుకుని, అటు తరవాత వారి వెంట తాను కూడా సపరివారంగా ప్రయాణమై నాగలోకానికి వెళ్ళాడు.

నాగలోకంలోని ఐశ్వర్యమూ, అందమూ, వైభవమూ చూసి కాశీరాజుకు చెప్పతరంకాని ఆశ్చర్యం కలిగింది.

"ఇంత వైభవంలో ఓలలాడుతూ మీరు పాము రూపంలో చీమల పుట్టపై చుట్టచుట్టుకుని పడుకోవటానికి కారణమేమిటి?" అని కాశీరాజు నాగరాజును అడిగాడు.

"రాజా, ఇక్కడ ఎంత వైభవం ఉన్నప్పటికీ, జన్మరాహిత్యం పొందే సౌకర్యం మీ మానవ లోకంలో మాత్రమే ఉన్నది!" అని నాగరాజు ఆయనకు సమాధానం చెప్పాడు.

కాశీరాజు ఈ మాట విని పరమానందం చెందాడు. ఆయన తన రాజ్యానికి తిరిగి వెళ్ళేటప్పుడు నాగరాజు ఆయనకు అంతులేని బహుమానాలిచ్చి పంపాడు.





# కృష్ణకుమారి

రాజస్థాన్‌లోని ఉదయపూర్ రాజ్యం, మహారాణాల కాలంలో అతి వైభవంగా వెలుగొందింది. మహారాణా భీమ్‌సింగ్ పరిపాలించినప్పుడు, ఉదయపూర్ అందాల నగరంగా అభివృద్ధి చెందింది.

ఆ అందాల నగరంలో, మహారాణా కుమార్తె కృష్ణకుమారి అందాలరాశిగా పేరుగాంచింది. ఆమె అందానికి ముగ్ధులై అందరూ ఆమెను 'రాజస్థాన్ కుసుమం'గా చెప్పుకునేవాళ్ళు. ఆమె మధురమైన సున్నిత స్వభావం, ఉదయపూర్ ప్రజలకు ఎంతో సంతోషం కల్గించింది.





జయ్‌పూర్ పాలకుడైన జగత్సింగ్ యువరాణిని పెళ్ళాడాలని ఆశించి తన దూతను మహారాణా వద్దకు పంపాడు. త్వరలోనే తన నిర్ణయాన్ని తెలియజేయగలనని మహారాణా, జగత్సింగ్ దూతకు మాట ఇచ్చి పంపాడు. కూతురి పెళ్ళి విషయం రాణీతోనూ, మంత్రులతోనూ సంప్రదించాలని మహారాణా అనుకున్నాడు.

మాన్‌సింగ్‌కు అమీర్ ఖాన్ అనే మిత్రుడు వుండేవాడు. అతడు సమయం దొరికినపుడల్లా మాన్‌సింగ్ ఉదయపూర్ యువరాణిని తప్పకుండా పెళ్ళాడాలని పురికొల్ప సాగాడు. ఆ ప్రోత్సాహంతో మాన్‌సింగ్, మహారాణా వద్దకు మాటిమాటికీ తన దూతలను పంపి, ఒత్తిడి చేయసాగాడు.





అఖరుకు, మాన్‌సింగ్ తరపున, అమీర్ ఖాన్ స్వయంగా మహారాణాను కలుసుకుని, "మాన్‌సింగ్‌కు నీ కుమార్తెను ఇవ్వకపోతే, ఉదయపూర్‌ను నాశనం చేస్తాం. నీ కుమార్తెను నీవు చంపినా ఫరవాలేదు. కాని, ఆమెను జగత్సింగ్‌కు మాత్రం ఇవ్వకూడదు," అని హెచ్చరించాడు.

తన తల్లిదండ్రులకు ఏర్పడిన సంకట పరిస్థితిని గురించి విన్న కృష్ణకుమారి ఎంతో విషాదం చెందింది. తన మూలంగా, ఉదయపూర్ నగరం నాశనం కావడం ఆమెకు ఇష్టం లేదు. అయినా ఆమె ఏ తప్పూ చేయకుండానే, కన్నవాళ్ళు కూడా ఆమెతో మాట్లాడడం మానేశారు.





అయితే, ఆ వెంటనే, జగత్సింగ్‌కూ, మార్వార్ పాలకుడైన మాన్‌సింగ్‌కూ యుద్ధం జరిగింది. యుద్ధంలో జగత్సింగ్ ఓడిపోయాడని మాన్‌సింగ్ ప్రకటించాడు. అయినా జగత్సింగ్ ఓటమిని అంగీకరించలేదు. పర్యవసానంగా ఇద్దరూ బద్ధశత్రువులయ్యారు.

యుద్ధం ముగిశాక మాన్‌సింగ్ ప్రతినిధి, ఉదయపూర్ మహారాణాను కలుసుకుని, "యువరాణి కృష్ణకుమారిని, మా రాజు మాన్‌సింగ్ వివాహమాడాలని ఆశిస్తున్నాడు. యుద్ధంలో జయించిన వీరుడైన మా రాజుకు మీ కుమార్తెను ఇవ్వడానికి సంతోషంగా అంగీకరించగలరని నమ్ముతున్నాము," అన్నాడు.





మహారాణా, రాణీ సందిగ్ధంలో పడ్డారు. జగత్సింగ్, మాన్‌సింగ్ ఇద్దరూ కూడా బలంగలవాళ్ళే. కనక తమ కుమార్తెను ఎవరికి ఇవ్వమన్నా వారితో ఉదయపూర్‌కు విరోధం తప్పదు. అప్పటి ఉదయపూర్ ఏ ఒక్కరినిగానీ ఎదుర్కొగల స్థితిలో లేదు.



కొన్ని రోజులు గడిచేలోపలే, జగత్సింగ్, మాన్‌సింగ్ ఇద్దరూ కూడా, ఉదయపూర్‌ను పట్టుకుని, యువరాణిని పెళ్ళాడడానికి బయలుదేరారు. నగరమంతా భయం అలముకున్నది. రాజుకూ, ఆయన పరివారానికీ ఏం చెయ్యడానికీ పాలుపోలేదు.

ఒకనాడు రాత్రి యువరాణి పడుకుని ఉన్నప్పుడు, మసకచీకట్లో, చేతిలో కత్తితో ఒక వ్యక్తి తనను సమీపించడం గమనించి 'బాబాయ్' అని కేక పెట్టింది. వెంటనే ఆ వచ్చిన జవాన్‌దాస్ అనే మహారాణా బంధువు కత్తిని దూరంగా విసిరివేసి అక్కడి నుంచి పారిపోయాడు.





తన మరణం ఒక్కటే నగరానికి వచ్చిన అపాయాన్ని తప్పిస్తుంది కాబట్టి, తన్ను చంపడానికే పెద్దలు జవాన్‌దాస్‌ను నియోగించినట్టు యువరాణి గ్రహించింది. వెంటనే ఆమె, చెలికత్తెలను విషం తెమ్మన్నది. విషాదం నిండిన నవ్వుతో, విషాన్ని తాగి, తన కుటుంబాన్నీ, నగరాన్నీ రక్షించడం కోసం ఆమె ప్రాణం విడిచింది.



# తొందరపాటు

బస్రానగరంలో అబ్దుల్ రజాక్ అనే వర్తకుడుండేవాడు. అతడికి ఇద్దరు కవల కుమారులు. ఒకసారి అతడు వర్తకం పనిమీద ఓడలో బయలుదేరి, చాలాకాలం ప్రయాణం తర్వాత ఒక ద్వీపాన్ని చేరాడు. అక్కడ అతడు తెచ్చిన వస్తువులకు గిరాకీ వుండడంతో, వ్యాపారం చాలా లాభసాటిగా జరిగింది. ఆ ద్వీపాన్నేలే రాజు స్వయంగా అతడి ఓడ దగ్గిరకు వచ్చి, విలువైన అనేక వస్తువులు కొన్నాడు.

రజాక్ ఓడ వర్తకం చేస్తూ లోగడ అనేక ద్వీపాలు తిరిగి వున్నాడు. రాజు, అతణ్ణి తన భవనానికి ఆహ్వానించి గొప్ప విందుచేసి, అతడి ద్వారా ఆయా ద్వీపాల్లోని విశేషాలు విన్నాడు. ఆయనకు రజాక్‌లాంటి అనుభవజ్ఞుడి నుంచి కొత్త విషయాలు తెలుసుకోవాలన్న కోర్కె కలిగింది. ఆ కారణంవల్ల రాజు, అతణ్ణి తన ఆస్థానంలో కొంతకాలం వుండవలసిందిగా వత్తిడి చేశాడు.

ఈ విధంగా కొన్ని సంవత్సరాలు గడిచిపోయినై. రజాక్ భార్య, తన భర్త ఎంతకూ తిరిగి రానందుకు విచారగ్రస్తురాలై, తన యిద్దరు కొడుకులను వెంటబెట్టుకుని, అతడున్న ద్వీపానికి బయలుదేరింది.

కొన్నాళ్ళకు వాళ్ళు ఒక రేవుపట్టణం చేరారు. ఆ రేవుకు రజాక్ వున్న ద్వీపం నుంచి రాత్రివేళ ఒక ఓడ వస్తున్నట్టు రజాక్ భార్యకు తెలిసింది. ఆమె తన యిద్దరు కొడుకులనూ, ఆ ఓడలో వున్న వాళ్ళను అడిగి, తమ తండ్రిని గురించిన సమాచారం తెలుసుకు రమ్మని పంపింది.

కవలలిద్దరూ రేవు చేరి ఓడలోకి వెళ్ళారు. ఆ ఓడ మరెవరిదో కాదు;

అరేబియా కథ



వాళ్ళ తండ్రిదే! అతడు, రాజుకు వీడ్కోలు చెప్పి బస్రాకు తిరుగుప్రయాణమై వస్తున్నాడు. కవలలు ఓడలోకి వెళ్ళిన అదే సమయంలో, రజాక్ తన డబ్బు సంచీ కనబడక, దాన్ని గురించి కళాసులను ప్రశ్నిస్తున్నాడు. ఆ సంచీ దొంగిలించిన కళాసు, కొత్తగా ఓడలోకి వచ్చిన కవలలను రజాక్‌కు చూపించి, వాళ్ళు డబ్బు సంచీ దొంగిలించడం తాను చూశానని చెప్పాడు.

రజాక్ పట్టరాని కోపంతో, ఆ కుర్రవాళ్ళు తన కొడుకులని తెలియక, ఆ ఇద్దర్నీ సముద్రంలో పారవేయమని కళాసులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు వెంటనే కవలలను ఓడ మీది నుంచి సముద్రంలోకి గిరవాటు వేశారు.

రజాక్ భార్య తన కొడుకులు తిరిగి రానందుకు రాత్రంతా దిగులుతో గడిపి, తెల్లవారుతూనే ఓడ దగ్గిరకు వెళ్ళింది. రజాక్ ఆమెను చూసి పరమానందం చెందాడు. కాని, ఆమె తమ కవలపిల్లలను గురించి చెప్పగానే, అతడు దుఃఖం ఆపుకోలేకపోయాడు. రాత్రి తాను సముద్రంలో తోయించిన వాళ్ళు తన కొడుకులని రజాక్ గ్రహించాడు.

వాళ్ళు ఏదో విధంగా ఒడ్డుచేరి వుంటారన్న ఆశ, ఆ భార్యాభర్తలకు కలిగింది. వాళ్ళు ఎన్నో రోజులపాటు కవలల కోసం సముద్రతీర ప్రాంతాలు గాలించి, వాళ్ళ జాడ తెలియకపోవడంతో ఇంటికి తిరిగి వచ్చారు.

కొంతకాలం గడిచింది. రజాక్, అతడి భార్య ఎవరైనా కుర్రవాణ్ణి దత్తు చేసుకోవాలనుకున్నారు. ఒకనాడు రజాక్ బానిసల సంత నుంచి ఒక యువకుణ్ణి కొని, ఇంటికి తీసుకు వచ్చాడు.

అతడి భార్య వాణ్ణి చూస్తూనే, భర్తతో, "అయ్యో, మీరు గుర్తించనే లేదా? వీడు ఎవరో కాదు—మన కవలల్లో చిన్నవాడు!" అన్నది కొడుకును ఆప్యాయంగా కావిలించుకుంటూ.

రజాక్‌కు కలిగిన సంతోషం అంతా యింతా కాదు. అతడు చిన్నవాణ్ణి, వాడి అన్నను గురించి అడిగాడు. వాడికి అన్న ఏమైనదీ తెలియదు. సముద్రంలో పడి గిలగిల్లాడుతున్న అతణ్ణి ఒక పడవవాడు చూసి రక్షించి, బానిస వర్తకుడికి అమ్మి వేశాడు.

ఆరు నెలలు తిరక్కుండానే తండ్రీ, కొడుకులిద్దరూ కొన్ని వ్యాపార వస్తువులతో ఓడలో బయలుదేరి ఒక ద్వీపం చేరారు. చిన్నవాడు, ఆ ద్వీపాన్నేలే యువకుడైన రాజుకు బహుమతిగా కొన్ని విలువైన వస్తువులు తీసుకుని, అతడి భవనానికి వెళ్ళాడు.

రాజు, ఆ బహుమాన వస్తువులు చూసి సంతోషించి, చిన్నవాణ్ణి కొంతకాలంపాటు తనకు అతిథిగా వుండమని కోరాడు. ఈ విధంగా వాళ్ళిద్దరి మధ్యా మంచి స్నేహం ఏర్పడింది. ఇది, రాజ పరివారంలోని కొందరికి కోపకారణమైంది. వాళ్ళు చిన్నవాడికి హాని చేసేందుకు పథకాలు వేయసాగారు.

ఒకనాటి సాయంత్రం రాజుకు హఠాత్తుగా జబ్బు చేసింది. చిన్నవాడు అక్కడికి చేరిన కొద్ది దినాల్లోనే, రాజోద్యోగుల్లో కొందరు, రాజును బాగా ద్వేషిస్తున్నట్టు తెలుసుకున్నాడు. అలాంటి



వాళ్ళకు జబ్బుపడి నిస్సహాయ స్థితిలో వున్న రాజును తుదముట్టించడం ఏమంత కష్టం కాదు!

చిన్నవాడు యిలా ఆలోచించి, ఆ రాత్రి రాజు పడకగది ముందు కత్తి పట్టుకు నిలబడి, తెల్లవార్లూ కాపలా కాశాడు. తెల్లవారాక రాజుకు కొంత స్వస్థత కలిగింది.

రాత్రి చిన్నవాణ్ణి రాజుగారి పడకగది ముందు చూసిన రాజోద్యోగులు ఆయనతో, "రాత్రి వర్తకుడి కొడుకు కత్తిదూసి, మీ పడకగది వైపుకు పోతూండడం, మా కళ్ళబడింది. మమ్మల్ని చూసి భయపడి పూరుకున్నాడు గాని, లేకపోతే మిమ్మల్ని

హత్యచేసి వుండేవాడు. ఈ దుష్టుణ్ణి వెంటనే ఉరితీయించండి!'' అని చెప్పారు.

రాజు కొంచెం సేపు ఆలోచించి, ''తొందరపాటు ఎన్ని దుష్ఫలితాలకు కారణం అవుతుందో, నాకు తెలుసు. ముందు వీణ్ణి ఖైదులో పెట్టండి. తరవాత ఏం చేయడం బావుంటుందో నిర్ణయిస్తాను,'' అన్నాడు.

ఈ వార్త తెలిసి వర్తకుడు రజాక్, పరుగుపరుగునా రాజు దగ్గిరకు వచ్చి, ''ప్రభూ, నా కొడుకు నేరస్థుడవునో కాదో ముందు విచారణ జరపండి. తొందరపడి ఏ పనీ చేయరాదు. అది ఒక్కొక్కసారి ఎంతో కీడు కలిగిస్తుంది. ఒక్క తొందర పాటు కారణంగా, నేను జీవితమంతా మరువలేని దుఃఖం అనుభవిస్తున్నాను,'' అన్నాడు.

ఆ మాటలకు రాజు ఆశ్చర్యపోతూ, ''ఏమిటి నీ తొందరపాటు?'' అని అడిగాడు.

''నా కన్నకొడుకు లిద్దర్నీ సముద్రంలో తోయించాను. ఇది నమ్మగలరా?'' అంటూ రజాక్ జరిగినదంతా చెప్పాడు.

రాజు సంతోషంతో చిన్నగా కేకపెట్టి, ''నాన్నా యిప్పుడు నేను ఖైదు చేయించినవాడు, నా తమ్ముడన్నమాట!'' అంటూ రజాక్‌ను కావిలించుకున్నాడు.

తన పెద్దకొడుకు కూడా జీవించి వున్న సంగతి విని, రజాక్ పరమానందం చెందాడు. రాజు అప్పటికప్పుడే తమ్ముణ్ణి ఖైదు నుంచి రప్పించాడు.

జరిగినదేమంటే; సముద్రంలో పడిన పెద్దవాడు ఒక కొయ్యసాయంతో ప్రాణాలు రక్షించుకుంటూ, ఈ ద్వీపం చేరాడు. ద్వీపాన్నేలే రాజుకు పిల్లలు లేరు, వృద్ధుడు. ఆయన పెద్దవాణ్ణి దత్తు చేసుకుని, తన మరణ సమయంలో, అతణ్ణి రాజుగా ప్రకటించాడు.

ఈ విధంగా కథ సుఖాంతమై, ఆ ద్వీపంలో రజాక్, అతడి భార్యా తమ పిల్లలతో చాలా కాలం హాయిగా జీవించారు.





# పెద్దదిక్కు

సింహాచలం ఒక చిన్న గ్రామంలో వుంటూ పట్నంలోని గురవయ్య కిరానాదుకాణంలో పద్దులురాసే ఉద్యోగం చేస్తూండేవాడు. అతడి జీతం నెలకు రెండువందల రూపాయిలు. చిన్నతనంలో తల్లిదండ్రులు పోగా, అతణ్ణి పినతల్లి మీనాక్షి పెంచి పెద్ద చేసింది. ఆమెకొక కూతురు. పెళ్ళీడు రాగానే కూతురుకు వివాహం చేసి, అత్తవారింటికి పంపి, తాను మాత్రం సింహాచలం ఇంట్లోనే వుంటున్నది.

సింహాచలం ఏమాత్రం అందగాడు కాదు; పైపెచ్చు చిన్న జీతగాడు. ఐనా అతడి పెళ్ళి మంచి అందచందాలు గల లావణ్యతో జరిగింది. అందుక్కారణం లావణ్య తల్లిదండ్రులు పేదవాళ్ళు కావడం.

ఈ పెళ్ళి కాకముందు లావణ్య, తన అందం చూసి మురిసిపోయి, ఏ జమీందారు కొడుకో తనను చేసుకుంటాడని కలలుకనేది. సింహాచలంతో పెళ్ళి, ఆమెకు ఎంతమాత్రం యిష్టం లేదు. సింహాచలం పిన్ని మీనాక్షి, తన తల్లిదండ్రులను పెద్ద కట్నం కోరాలనీ, ఆ విధంగా యీ పెళ్ళి తప్పిపోవాలనీ, ఆమె ఎందరో దేవుళ్ళకు మొక్కుకున్నది.

అయితే, మీనాక్షి మాత్రం లావణ్య తల్లిదండ్రులతో, "మా నుంచి కట్న కానుకల ప్రసక్తే వుండదు. ఈ శుభ సమయంలో దాని సంగతి మరిచిపోదాం," అన్నది.

ఈ మాట విని లావణ్య కుంగిపోయింది; ఆమె తల్లిదండ్రులు పొంగిపోయారు. ఈ విధంగా లావణ్యకు యిష్టం లేని పెళ్ళి జరిగిపోయింది. అందువల్ల, కాపురానికి వచ్చిన రోజు నుంచీ ఆమె,

మాచిరాజు కామేశ్వరరావు



సముద్ర వ్యాపారమా? ఈ కరువు కాలంలో తిండిదండగ మనుషుల్ని ఎంతకని పోషిస్తాం?'' అన్నది.

పక్క గదిలో నిద్రపోతూ, మంచినీళ్ళ కోసం లేచిన మీనాక్షి, యీ మాటలు విన్నది. ఆమె తెల్లవారుతూనే, ఏ కారణం చెప్పకుండా కూతురు ఇంటికి ప్రయాణం కట్టింది. సింహాచలానికి యిది చాలా కష్టం అనిపించినా, భార్య నోటికి భయపడి, అతడేమీ మాట్లాడ లేదు.

అతడు బాడుగబండిలో పినతల్లిని, ఆమె కూతురు ఇంట దిగవిడిచి, పట్నం చేరేసరికి చాలా ఆలస్యం అయిపోయింది. ఆ కారణంగా, అతడు బాగా పొద్దుపోయే వరకూ దుకాణంలో వుండవలసివచ్చింది.

పట్నం నుంచి అతడి పల్లెకు మామూలు దారి కాకుండా, మరొక అడ్డదారి వున్నది. తొందరగా ఇల్లు చేరాలన్న ఆత్రంలో అతను, జనం మసలని ఆ అడవిదారి పట్టాడు. సింహాచలం అడవి మధ్య వుండగానే చీకటిపడింది. అయితే, పున్నమి రోజు కావడంవల్ల పుచ్చపువ్వులా వెన్నెల కాస్తున్నది.

అతడు ఒక చెట్టు కిందికి వచ్చేసరికి, చెట్టు ఆకులు గలగలమన్నవి. ఆ వెంటనే ఆకుల మధ్య నుంచి, ''ఎవరో, వారెవరో రావాలి! వారికి అడిగిందివ్వాలి!'' అంటూ

కట్నం కోరని మీనాక్షిని శత్రువును చూసినట్టు చూడసాగింది.

నెల తిరక్కుండానే ఒకనాటి రాత్రి ఆమె, సింహాచలంతో, ''ఈ రోజుల్లో సొంత అత్తలనే చూసేవాళ్ళు లేరు; ఇక పిన అత్తగారికి ఊడిగం చేసేదెవరు! మీ పిన్నిని, వాళ్ళ కూతురు దగ్గిరకు వెళ్ళమని చెప్పు,'' అన్నది.

ఈ మాటలకు సింహాచలం నొచ్చుకుని, ''అదేం మాట! మా పిన్ని, మనకు ఇంట్లో పెద్ద దిక్కుగా వుంటుంది కదా,'' అన్నాడు.

ఆ జవాబుకు లావణ్య విసుక్కుంటూ, ''మనకే తిండికి దిక్కులేదు. నీదేమైనా

కర్ణకఠోరమైన గొంతుతో ఒక పాటవిని పించింది.

సింహాచలం ఆశ్చర్యపోతూ తల ఎత్తి చూసి, అది ఒక నేరేడుచెట్టని గ్రహించి, "నేరేడుచెట్టు ఏమివ్వగలదు? నేరేడు పండేగా!" అన్నాడు.

ఆ మరుక్షణం నేరేడు పండొకటి అతడి కాళ్ళ దగ్గిర పడింది. దాన్ని తీసుకుని సంచీలో వేసుకుని ముందుకు నడిచాడు సింహాచలం.

కొద్ది దూరం నడవగానే మరొక చెట్టు ఆకులు గలగలమన్నవి. తరవాత, "ఏమివ్వను? నీకేమివ్వను?" అంటూ మరింత కర్ణకఠోరమైన పాట వినిపించింది.

సింహాచలం ఆ చెట్టును వెలగచెట్టుగా గుర్తించి, "వెలగచెట్టు యివ్వగలిగేది, వెలగపండు. అంతేగదా?" అన్నాడు.

మరుక్షణం అతడి కాళ్ళ దగ్గిర ఒక వెలగపండు పడింది. సింహాచలం దాన్ని కూడా సంచీలో వేసుకున్నాడు. అతడు మరి కొద్ది దూరం నడవగానే, మరొక చెట్టు ఆకులు కదిలి, "అందిస్తాను, అందుకో! అడిగింది ఆలోచించక యిస్తాను, తీసుకో!" అన్న మరింత కర్ణకఠోరమైన పాట వినిపించింది.

సింహాచలం రెండు చెవులూ మూసుకుని, ఆ చెట్టు మామిడిచెట్టని గ్రహించి,



"మామిడిచెట్టు, మామిడిపండు గాక యివ్వగలిగిందేముంటుంది!" అన్నాడు.

వెంటనే అతడి కాళ్ళ దగ్గిర మామిడి పండొకటి పడింది. సింహాచలం దాన్ని కూడా తీసుకుని కొంతసేపటికి ఇల్లు చేరాడు.

లావణ్య సంచీలో వున్న, ఆ మూడు పళ్ళనూ చూసి ఆశ్చర్యపోయి, "కాలం కాని కాలంలో యివి ఎక్కడ దొరికినై, నీకు?" అంటూ భర్తను అడిగింది.

సింహాచలం జరిగినదంతా ఆమెకు చెప్పాడు.

లావణ్య అతడి కేసి కోపంగా చూస్తూ, "ఎంత బుద్ధిమాలిన పని చేశావు! నీతో



మాట్లాడింది, ఆ చెట్లే అనుకున్నావా? ఆ మాట్లాడింది, ఆ చెట్ల మీద వుండే పరోపకారి పిశాచాలో, వనదేవతలో అయి వుంటవి. రేపు మళ్ళీ చీకటిపడ్డాక, ఆ దారినే రా. వాటిని ఏం అడగాలో తెల్లవారాక, నీకు చెబుతాను,'' అన్నది.

ఆమె రాత్రి అంతా నిద్రమాని, పిశాచాలను ఏం అడగాలో బాగా ఆలోచించి, తెల్లవారాక భర్తకు చెప్పింది.

మర్నాడు సింహాచలం చీకటిపడిన తరవాత అడవిదారిన బయలుదేరాడు. అతడు నేరేడుచెట్టును చేరుకునేసరికి చిన్నగా వర్షం ప్రారంభమైంది. నేరేడు ఆకుల గలగలలతోపాటు అతడికి కిందటి రాత్రి విన్న మాటలు కూడా స్పష్టంగా వినిపించినై.

భార్య చెప్పింది బాగా గుర్తు పెట్టుకున్న సింహాచలం, ''నేరేడుచెట్టు నాకు అందాన్ని ప్రసాదిస్తే, ఎంత ఆనందపడతాను!'' అన్నాడు.

చెట్టు మీది నుంచి ధారగా నీరు అతడి మీద పడింది. మెరుపుల వెలుగులో సింహాచలం తన శరీరాన్ని చూసుకుని, అది పసిమిఛాయలో వుండడంతో పరమానందం చెందాడు.

అతడు వెలగచెట్టును చేరేలోపల పెద్ద శబ్దంతో పిడుగుపడి, నేరేడుచెట్టు భగభగమనే మంటలతో నేల కూలింది.

వెలగచెట్టును చేరిన సింహాచలం, ''వెలగచెట్టు వెలలేని ఐశ్వర్యం యిస్తే, అద్భుతం కదా!'' అన్నాడు.

అతడి కాళ్ళ దగ్గిర ఒక ఖాళీ సంచీ పడింది. సింహాచలం దాన్ని చేతికి తీసుకునేంతలో, సంచీలోంచి జలజలమంటూ ఆగకుండా బంగారుకాసులు పడసాగాయి. అతడు కిందపడిన కాసుల్ని వదల బుద్ధి కాక, వాటిని సంచీలో వేసుకుని, ఆ సంచీ మోసుకుంటూ బయలుదేరాడు.

అతడు మామిడిచెట్టును సమీపించగానే, పిడుగుపాటుకు గురిఅయి, వెలగ చెట్టు నేలకు ఒరిగింది.

"మామిడిచెట్టు నా పైన అదృష్టాన్ని ముద్రగా వేస్తే, అమోఘంగా వుండదా!" అన్నాడు సింహాచలం చెట్టు కొమ్మల్లోకి చూస్తూ.

వెంటనే అతడి తలపైన ఏదో పడినట్టయింది; కాని తడిమి చూసుకుంటే అతడి చేతికి ఏమీ తగలలేదు. సింహాచలం అక్కడి నుంచి కొంచెం ముందుకు కదలగానే మామిడిచెట్టు కూడా పిడుగుదెబ్బకు గురి అయింది.

ఆ తరవాత ఇంటి దారిపట్టిన సింహాచలానికి పెనుగాలివల్లా, బంగారంతో బరువుగా వున్న సంచీవల్లా నడవడం కష్టసాధ్యం కాసాగింది. అతడు కొంచెం ఎత్తుగా వున్న దిబ్బనొకదాన్ని ఎక్కి దిగబోతూ కాలుజారి, పక్కనే వున్న ఊబిలో పడిపోయాడు. బంగారుకాసుల సంచీ ఊబి అడుక్కు మునిగిపోయింది. అతడి శరీరం క్రమంగా భుజాలవరకూ ఊబిలో దిగబడి పోయింది.

ఇక తనకు చావు తప్పదనుకున్నాడు, సింహాచలం. కాని, అదృష్టం అతణ్ణి అంటిపెట్టుకునే వున్నది. హఠాత్తుగా దాపులనున్న చెట్టుకొమ్మ ఒకటి ఫెళఫెళమంటూ విరిగి, అతడికి చేరువగా ఊబిలో పడింది. అతడు దాన్ని పట్టుకుని, ఊబి నుంచి బయటపడ్డాడు.

సింహాచలం తూర్పు తెల్లవారుతూండగా ఇల్లు చేరి, స్పృహ తప్పి పడిపోయాడు. లావణ్యకు ఆ స్థితిలో వున్న



భర్తను చూసి దడపుట్టుకు వచ్చింది. ఏం చెయ్యాలో చెప్పేందుకు ఇంట్లో అనుభవం గల పెద్దదిక్కంటూ లేదు! ఏమీ పాలుపోని లావణ్య, మీనాక్షికి కబురు పంపింది.

మధ్యాహ్నానికల్లా పుట్టెడు దిగులుతో మీనాక్షి వచ్చింది. ఆమె సపర్యలతో సింహాచలం ఒక నెల రోజులకు మామూలు మనిషి అయాడు. అతడికి అడవిలో లభించిన బంగారం, పచ్చని శరీరచ్ఛాయా పోగా—కొత్తగా శరీరం మీద అక్కడక్కడా మానిన గాయపు మచ్చలు మాత్రం మిగిలినై!

జరిగిందేమిటో వివరంగా విన్న మీనాక్షి, లావణ్యతో, "నీ భర్తకు, మొదటి పిశాచాన్ని అందం అడగమని చెప్పావు; అందం కన్న ఆరోగ్యం ముఖ్యం. అది లేకపోతే, రెండో పిశాచి యిచ్చిన బంగారం వృథా. మొత్తం మీద మూడో దాన్ని కోరిన అదృష్టమే అతణ్ణి ఊబి నుంచి కాపాడింది," అన్నది.

"మీరు ఆ సమయంలో సలహా చెప్పడానికి లేరు. అందువల్లనే నేను, ఆయనను యీ అవివేకపు కోరికలు కోరమని, నానా అగచాట్లకూ గురి చేశాను," అన్నది లావణ్య కళ్ళనీళ్ళతో.

"ఇప్పుడైనా మించిపోయిందేం లేదు. అదృష్టం అండగా కష్టపడి పనిచేసే నీ భర్త, తప్పక అభివృద్ధిలోకి వస్తాడు. పది కాలాల పాటు సుఖంగా వుండండి!" అని మీనాక్షి తిరుగు ప్రయాణానికి వెంట తెచ్చుకున్న పెట్టెలో బట్టలు సర్దుకో సాగింది.

లావణ్య కళ్ళనీళ్ళు తుడుచుకుని, ఆమె రెండు చేతులూ పట్టుకుని "అత్తయ్యా, నా మూర్ఖత్వాన్ని క్షమించండి! మీరు ఎక్కడికీ వెళ్ళవద్దు. మీరు తప్ప మాకు పెద్ద దిక్కు లేదు," అన్నది దీనంగా.

లావణ్యలో వచ్చిన మార్పు మీనాక్షికే కాక, సింహాచలానికూడా ఎంతో ఆనందం కలిగించింది.





# మతిమరుపు నౌకరు

ఆత్రేయపురం జమీందారు పంకజనాభుడి దివాణంలో, సిద్ధయ్య అనే ఒక నౌకరు వుండేవాడు. వాడికి ఎక్కడలేని మతిమరుపు. ఇప్పుడు విన్నది, మరి కాసేపటికి మరిచిపోయేవాడు. యజమాని ఒక పని చెబితే, మతిమరుపువల్ల మరేదో పని చేస్తూండేవాడు. అయితే, స్వతహాగా నమ్రతకలవాడూ, ఒళ్ళు దాచుకోకుండా పని చేసేవాడూ కావడం వల్ల, జమీందారు వాణ్ణి క్షమించి ఊరుకునేవాడు.

ఒకనాటి రాత్రి జమీందారుకు అకస్మాత్తుగా కడుపునొప్పి వచ్చింది. ఆయన సిద్ధయ్యను వైద్యుడు శేషాచారి దగ్గిరకుపోయి కడుపునొప్పికి మాత్రలు తీసుకురమ్మని చెప్పాడు. సిద్ధయ్య, శేషాచారి దగ్గిరకు వెళ్ళి, ఆయన యిచ్చిన మాత్రలతో పావు గంటకల్లా తిరిగి వచ్చాడు. కాని, ఆ మాత్రలు వేసుకున్న జమీందారుకు కడుపునొప్పి తగ్గలేదు. తెల్లవార్లూ ఆయనబాధపడుతూనేవున్నాడు

మర్నాటి ఉదయానే శేషాచారి జమీందారును చూడవచ్చి, ''మీ తలనొప్పి ఎలా వుంది ?'' అని అడిగాడు.

జమీందారు కోపంతో మండిపోతూ, ''నాకు తలనొప్పని, నీకు చెప్పిందెవరు ? సిద్ధయ్యతో కడుపునొప్పి అని చెప్పి పంపించాను. కొంపదీసి తలనొప్పి మాత్రలుగాని యిచ్చావేమిటి ? నీ మూలంగా తెల్లవార్లూ ఎంత బాధపడ్డానో తెలుసా !'' అన్నాడు.

శేషాచారి బిక్కచచ్చిపోయి, ''తమరు అలా అంటున్నారేమిటి ? సిద్ధయ్య నాతో, మీకు తలనొప్పి అనే చెప్పాడు. అందువల్లే, తలనొప్పి మాత్రలు యిచ్చి పంపాను,'' అన్నాడు.

జమీందారుకు పొరబాటు సిద్ధయ్యదే అని తెలిసిపోయింది. ఆయనకు రాత్రి

యం. ఐ. కిషన్

తాను పడ్డ బాధ తలుచుకునేసరికి ఒళ్ళు మండింది. వెంటనే సిద్దయ్యను పిలిచి గట్టిగా చీవాట్లు పెట్టి, "ఒరే, నీ మూలంగా రాత్రంతా నేను విపరీతమైన బాధకు గురయ్యాను. నీలాంటి మతిమరుపు వెధవను పనిలో పెట్టుకోవడం, నాదే పొరబాటు. నీ మతిమరుపువల్ల ముందు, ముందు ప్రాణాలే పోవచ్చు. నిన్ను పనిలోంచి తీసేశాను," అని, వాడికి రావలసిన జీతం డబ్బులు యిచ్చి పంపేశాడు.

అయితే, ఆ మర్నాడు సిద్దయ్య మామూలు ప్రకారం దివాణానికి వచ్చి, జమీందారుకు కనిపించాడు.

జమీందారు వాడికేసి కోపంగా చూసి, "నిన్ను పనిలోంచి తీసేసినట్టు నిన్ననే చెప్పాగదా. మళ్ళీ ఎందుకొచ్చావు?" అని అడిగాడు.

"అవును, దొరా! ఆ మాటే మరిచాను. ఇక నుంచి పనికి రానులెండి," అంటూ సిద్దయ్య దుస్తుల్లోంచి కొంత డబ్బు తీసి, "నిన్న తమరెందుకో యీ పైకం, నా కిచ్చారు. దాచమని చెప్పారేమో!" అని, నిన్న జమీందారు జీతం కింద యిచ్చిన డబ్బును ఆయన ముందు పెట్టి, అక్కణ్ణించి బయలుదేరాడు.

జమీందారుకు, సిద్దయ్య మతిమరుపు చూస్తూంటే, యీసారి కోపానికి బదులు, వాడిమీద చాలా జాలికలిగింది.

ఆయన వాణ్ణి వెనక్కుపిలిచి, "ఒరే, మతిమరుపు వెధవా! ఆ డబ్బు, నీదే. నిన్న నిన్ను పనిలోంచి తీసేస్తూ, నీకు రావలసిన జీతం కింద, ఆ మొత్తం యిచ్చాను, ఇదుగో, తీసుకో!" అన్నాడు.

"అవును, ఆ మాటే మరిచిపోయాను," అంటూ జమీందారు యిచ్చిన డబ్బు తీసుకుని, వెళ్ళిపోబోయాడు సిద్దయ్య.

జమీందారువాణ్ణి ఆగమని, "సిద్దయ్యా, నిన్ను మళ్ళీ పనిలో పెట్టుకుంటున్నాను. లోపలికి పో," అని చెప్పి, మరొక నౌకరు ద్వారా, మతిమరుపుకు మంచి మందున్నదేమో కనుక్కునేందుకు వైద్యుడు శేషాచారికి కబురుపెట్టాడు.





# విష్ణుకథ

రాముడు పట్టాభిషిక్తుడై, లక్ష్మణ భరత శత్రుఘ్నుల అండదండలతో రాజ్యాన్ని చక్కదిద్ది, ఆదర్శప్రాయంగా రాజ్య పాలన చేస్తూండగా, ప్రజలు అన్నివిధాలా ఆనందిస్తున్నారు.

ఒకనాడు పల్లెటూరి బ్రాహ్మణుడు ఒకడు తన అయిదేళ్ళ కొడుకు శవం తెచ్చి రాజద్వారం దగ్గిర నిలబడి ఏడవటం మొదలు పెట్టాడు. తనకున్న ఒకే కొడుకు అకాలమరణం పొందినందుకు ఏడుస్తూ ఆ బ్రాహ్మణుడు—రాజు సరిగా పాలిస్తే ఇలాటి అకాలమరణాలుండవనీ, ఇన్నాళ్ళకు ఇక్ష్వాకుల పరిపాలనలో, రాముడి హయాంలో దేశం దిక్కుమాలినదయిందనీ అన్నాడు.

రాముడీ సంగతి తెలుసుకుని చాలా చింతించి, తన మంత్రులనూ, వసిష్ఠుడు మొదలైన బ్రాహ్మణులనూ పిలిపించి, వారితో బ్రాహ్మణ బాలుడి అకాలమరణం గురించి చెప్పాడు. శంబుకుడనే ఒక శూద్రుడు గొప్ప తపస్సు చేస్తున్నాడనీ, అది యుగధర్మానికి విరుద్ధమనీ, అందుకే ఆ బాలుడు చనిపోయాడనీ, నారదుడు రాముడితో అన్నాడు.

రాముడు లక్ష్మణుడితో, "నీవు వెళ్ళి ఆ బ్రాహ్మణుణ్ణి ఓదార్చి, ఆ బాలుడి కళేబరాన్ని తైలభాండంలో భద్రంగా వుంచు," అన్నాడు. తరవాత అతను ఆయుధాలు తీసుకుని పుష్పకం ఎక్కి పడమరా, ఉత్తరమూ, తూర్పూ గాలించి,

**15. రామరాజ్యం**



చివరకు దక్షిణదిక్కున ఒక సరస్సులో తలకిందుగా తపస్సు చేస్తున్న మనిషి నొకణ్ణి చూశాడు.

రాముడు పుష్పకం దిగి, తన కత్తి దూసి శంబుకుడి తల నరికాడు. శంబుకుని తల కళ్ళు విప్పి ఆనందంగా రాముణ్ణి చూసి, "రాఘవా! మరణమన్నది ఏదో ఒకలాగ తప్పనిది. నీవు నిమిత్తమాత్రుడివి. వర్ణాశ్రమ ధర్మాలకు కట్టుబడి ఉన్న వివిధవర్గాలతో కూడిన ప్రజలకు నీవు రాజువి; రాజు ప్రజా సేవకుడు. ఆ ధర్మాన్ని నిర్వర్తించావు. నీవు విచారించవలసిన పనిలేదు. నిన్నెటువంటి పాతకమూ అంటదు; నేను కులానికీ, వృత్తికి అతీతుడైన యోగిని; విష్ణుసాయుజ్యాన్ని పొందుతున్నాను!" అని చెప్పి కళ్ళు మూసింది.

శంబుకుని భార్య కపిల రాముడితో, "సీతాపతీ! రాజధర్మ నిర్వహణలో మున్ముందు నీవు ఎదుర్కొనవలసి ఉన్న కఠోర పరీక్షకు ఇది నాంది! నేను నా భర్తతో సంతోషంగా వెళ్తున్నాను. దృఢచిత్తుడవై కర్తవ్య పాలన చెయ్యి!" అని చెప్పి భర్తతో చితిపై సహగమనం చేసింది.

రాముడు తిరిగి వస్తున్న దారిలో, ఒక గుడ్లగూబకు చెందిన చెట్టు తొర్రను దురాక్రమణ చేసిన గ్రద్దను శిక్షిస్తున్నట్లుగా దాని తలమీద చేత్తో తట్టాడు.

ఆ వెంటనే గ్రద్ద రూపం పోయి బ్రహ్మదత్తుడనే రాజు శాపవిమోచనం పొంది వెళ్ళాడు.

విశ్వామిత్రుడు రాముడి కొలువుకు వచ్చి, తనను అవమానించిన శకుంతుడు అనే రాజును వధించవలసిందిగా ఆజ్ఞాపించాడు.

అప్పటికప్పుడే రాముడు గురువు ఆనతిని తలదాల్చి శకుంతుణ్ణి వధించడానికి బయలుదేరాడు.

హనుమంతుడి తల్లి అంజనాదేవి శకుంతుడికి శరణు ఇచ్చింది. హనుమంతుడు తల్లి మాట నిలపడానికి, రామ

బాణానికి ఎదురొడ్డి రామనామం జపిస్తూ కన్నులు మూసి నిలబడ్డాడు. రాముడు విడిచిన బాణం హనుమంతుని హృదయంలో లీనమైంది.

ఇది చూసిన విశ్వామిత్రుడు దురాగ్రహం విడిచి శకుంతుణ్ణి దీవించి అక్కడి నుంచి వెళ్ళాడు.

ఒక అర్ధరాత్రి రాముడి శయన మందిరం ముందు ఒక కుక్క న్యాయం కోసం ఆర్తనాదం చేసింది. రాముడు దిగ్గున వచ్చి రక్తం కారుతూన్న దాని గాయాన్ని అదిమి పట్టాడు.



కుక్క తాను కిందటిజన్మలో పూజారిగా ఉన్నందువల్లే కుక్కగా పుట్టాననీ, నిష్కారణంగా తన్ను కొట్టినవాడిని పూజారిగా నియమించవలసిందనీ, అదే తగిన శిక్ష అనీ చెప్పింది. దాని గాయం మాయమై సుఖంగా వెళ్ళింది.

ఏ ప్రాణికీ నొప్పి కలగకుండా చక్కగా రాజ్యపాలన జరుగుతున్న రామ రాజ్యంలో—"పరాయివాడి ఇంట ఉన్న భార్యను తెచ్చిపెట్టుకొనేలాంటి సిగ్గుచేటు పని చేయడానికి, రాజ్యమేలే రాముడిని కాను—!" అనే మాట ఒక అల్పుడి నోట వెలువడింది.

సీతను అరణ్యంలో వదిలి రమ్మని రాముడు లక్ష్మణుడితో చెప్పాడు. లక్ష్మణుడు ఆక్రోశంతో ఆవేశపడుతూంటే, "లక్ష్మణా! ఒక అల్పుడు ఆడంబరంగా పలికిన మాట ఎంతోమంది మనస్సుల్లోనో దాగి ఉండవచ్చును గదా! రాజ్యమంటే నేలకాదు, మనుషులు! భిన్నవర్గాలతో నిండిన ఆ ప్రజల్ని పాలించడం అనేది కత్తి పదును మీద నడక! స్వార్థానికి ఏ మాత్రం తావు లేదు. జనవాక్యాన్ని కర్తవ్యంగా ఎంచి, గుండెను రాయి చేసుకొనవలసిన రాజును నేను!" అని రాముడు అన్నాడు.

మునిపత్నులతో ఆశ్రమాల్లో ముచ్చటగా గడపాలన్న నిండు చూలాలైన సీత కోరిక చెల్లించే నెపంతో, లక్ష్మణుడు రథం



మీద సీతను తీసుకెళ్ళి కీకారణ్యంలో దిగవిడిచి వచ్చి, ''అయ్యో! ఆ నాడు హనుమంతుడు సంజీవిని తెచ్చి నన్ను బ్రతికించింది ఇందుకా!'' అని గుండె లవిసేలాగ రోదించాడు.

వాల్మీకి మహర్షి సీతను తన ఆశ్రమానికి తీసుకెళ్ళాడు. సీత కుశుడు, లవుడు అనే అందమైన కవల కుమాళ్ళను కన్నది.

అయోధ్యా రాజ్యంలో అనావృష్టి ఏర్పడింది. వర్షాలు సరిగ్గా కురవక భూమి బీటలు బారింది. సీతావియోగంతో కుమిలి పోతున్న రాముడితో అశ్వమేధ యాగం చేయమని పెద్దలు ఆదేశించారు. బంగారంతో సీత విగ్రహాన్ని చేయించి పక్క నుంచుకొని రాముడు యాగదీక్ష పట్టాడు.

లవకుశులు వాల్మీకి రచించిన రామాయణాన్ని గానం చేస్తూ అయోధ్యకు వచ్చారు. ముని బాలకులమని చెప్పుకొన్న వారిని చూసి రాముడు ముచ్చటపడి కౌగలించుకొని కానుకలిచ్చి పంపాడు.

రఘు వంశీయులకు తప్ప అన్యులకు పట్ట శక్యం కాని అశ్వమేధయాగాశ్వాన్ని లవకుశులు పట్టి కట్టేశారు.

యాగాశ్వాన్ని విడిపించడానికి వచ్చిన శత్రుఘ్న, భరత, లక్ష్మణులతో యుద్ధం చేసి, వాళ్ళను మూర్ఛపోయేలా చేసిన లవకుశులను రాముడు ఎదుర్కొన్నాడు.

లవకుశులు తల్లి మీద ఆన పెట్టి బాణాలు వదిలారు. రాముడు మూర్ఛపోగా సీత వచ్చి పాదాలుపట్టి మేల్కొలిపింది. రాముడితోబాటు అంతా మూర్ఛ నుండి లేచారు.

వాల్మీకి రాముడికి కుమాళ్ళనూ, సీతనూ అప్పగించాడు. రాముడు సీతతో సింహాసనంపై కూర్చొని లవకుశులను తొడలపై కూర్చుండబెట్టుకొని వారిని యువరాజులుగా ప్రకటించాడు.

తరువాత రాముడు సీత తన ఔచిత్యానికి తగ్గట్టుగా అయోధ్యా ప్రజలముందు శపథం చేయవలసిందని చెప్పాడు.



సీత అయోధ్యానగర మధ్యంలో నిలబడి ఆకాశాన్ని చూసి, అయోధ్యా రాజ్యంపై వర్షం కురవాలని పలికింది. మరుక్షణంలో ఆకాశం మబ్బులతో నిండి అమృత జలధారలతో రాజ్యమంతటా వాన కురిసింది.

ఆ తరువాత సీత నేలను చూస్తూ, "అమ్మా! రఘువంశదీపకులైన కుమాళ్లు తండ్రి అండ చేరుకున్నారు. నాకు కావలసిందింకేమీలేదు, నన్ను స్వీకరించు!" అన్నది.

భూమి కంపించింది. భూమి రెండు పాయలుగా చీలింది. దివ్యకాంతులు వెలువడ్డాయి. రత్నసింహాసనంపై భూదేవి మీదకువచ్చి సీతను తన ఒడిలోకి తీసుకొని భూమిలోకి వెళ్ళిపోయింది. పుష్పవృష్టి కురిసింది. భూమి వెంటనే మూసుకుంది.

రాముడు భూమిని చీలుస్తానని విల్లెక్కుపెట్టాడు. అప్పుడు ఆకాశవాణి, "రామా! భూదేవిపై ఆగ్రహించడం పాడి కాదు. సీత భూజాత. భూమిలోకి వెళ్ళి నిజనివాసం చేరింది!" అని పలికింది.

రాముడు కుమాళ్ళను చూసుకొంటూ చాలా కాలం రాజ్యం చేశాక, యమధర్మరాజు బ్రాహ్మణవేషంతో వచ్చి, దేవరహస్యం చెప్పవలసి ఉందనీ, లక్ష్మణుడిని ద్వారం దగ్గిర కాపుంచమనీ, ఎవరినైనా రానిచ్చితే లక్ష్మణుడు మరణదండన పొందాలనీ, రాముడితో చెప్పి ఒప్పించాడు. లక్ష్మణుడు ద్వారపాలన చేస్తున్నాడు. యముడు నిజరూపంతో కనిపించి రాముడితో అవతరించిన పని తీరిందనీ, వైకుంఠానికి విష్ణువుగా చేరవలసిందనీ చెప్పాడు.

అదే సమయంలో దుర్వాసుడు వచ్చి తక్షణం రాముడిని చూడటానికి వెళ్ళనివ్వకపోతే రఘువంశాన్ని శపిస్తానన్నాడు. దుర్వాసుణ్ణి లోనికి వెళ్ళనిచ్చి, లక్ష్మణుడు అలాగే వెళ్ళి సరయూనదిలో మునిగిపోయాడు.

రాముడు లవకుశులను పట్టాభిషిక్తుల్ని చేసి రాజ్యపాలన చేయించాడు.

అది శ్రావణమాసం. సరయూ నది నిండుగా ఉరకలెత్తి ప్రవహిస్తూన్నది. ఆనాడు పూర్ణిమ. చంద్రగ్రహణపర్వదినం.

మంగళ తూర్యనాదాలు మ్రోగుతూండగా, భరతశత్రుఘ్నులు ఇరువైపులా అంటిపెట్టుకొని నడుస్తుండగా, రాముడు సరయూనదికి బయలుదేరాడు. అశేష ప్రజానీకం అనుసరించారు.



రాముడు నదీజలాల్లో ప్రవేశించాడు. వెనుకనే తమ్ముళ్ళు దిగారు. అప్పుడే గ్రహణం విడిపోయి, నిండు చంద్రబింబం దేదీప్యమానంగా ప్రకాశించింది. ఆకాశం నుండి జలజలా అఖండంగా పూలవాన కురిసింది. సామ, దేవగాంధార, హిందోళ, సురట రాగాలమేళవింపుతో వీణాధ్వనులు దిక్కులు మారుమ్రోగుతూండగా వినిపించాయి.

అంతటా వెన్నెల మరింత తెల్లగా వెల్లివిరుస్తున్నది, పూలవాన కురుస్తున్నది; క్షీరసాగరం లాగ సరయూనది పూలరాసులతో నిండిన ఉవ్వెత్తు కెరటాలతో వడివడిగా సాగింది!

అంతకుముందే క్షీరసాగరంలో లక్ష్మణుడు శేషతల్పంగా, సీత లక్ష్మిగా అమరి ఎదురుచూస్తున్నారు. భరతశత్రుఘ్నులు శంఖచక్రాలు కాగా రామావతారం చాలించి, విష్ణువు లక్ష్మిపాదాలొత్తగా శేషతల్పం అలంకరించాడు.

మాయామానుష విగ్రహుడై ఉత్తమ మానవతామూర్తిగా పితృవాక్యపాలనకై వనవాసం చేసి, కార్యసాధకుడైన మానవమాత్రుడిగా వానరులను కూడగట్టుకొని వారధినికట్టి, అజేయుడనని విర్రవీగిన రావణుడినికొట్టి రాక్షసపాలన అంతమొందించి సీతను తెచ్చి, ఏకపత్నీవ్రతుడై ఆదర్శపాలన చేసిన రాముని అవతారం విష్ణువు దశావతారాల్లో విశేషమైనదిగా కీర్తింపబడింది. రామరాజ్యం ఆచంద్రార్కం పేర్కొన బడుతుంది—

అని సూతమహర్షి రామావతారం ముగించి, కృష్ణావతారం గురించి చెప్పడం ప్రారంభించాడు.

ఒకానొకప్పుడు శివుడు తన భక్తులైన దానవప్రముఖుల్ని అవలీలగా విష్ణువు అంతమొందించడం చూసి, అసహనంగా కనుబొమలు ముడిచాడు. ఆ బొమముడి నుండి సహస్రకవచుడు అనే ఘోరాకారుడు ఉద్భవించాడు. పొరలుగా వెయ్యి కవచాలు, అజేయప్రభావంగల కుండలాలుగల సహస్రకవచుడు ప్రళయభీకర గర్జనచేసి, "నేను తెలివిమాలిన రాక్షస మాత్రుణ్ణికాను, రుద్రాంశ సంభూతుణ్ణి! చేవగలవాడైతే ఆ విష్ణు నన్నేం చేయగలడో చెయ్యమనండి!" అని లోకాలు దద్దరిల్లేలాగ అరిచి విజృంభించాడు.

విష్ణువు నర, నారాయణులనే జంట ఋషులుగా అవతరించాడు. నరనారాయణులు సహస్రకవచుడిని జయించగల శక్తి సాధనకు తపస్సు ప్రారంభించారు.

ఇంద్రుడు వారి తపోభంగానికి అప్సరసల్ని పంపాడు. నారాయణుడు తన తొడ నుండి ఊర్వశిని పుట్టించాడు. ఊర్వశి ముందు రంభాది అప్సరసలు వెలవెలపోయారు. ఇంద్రుడు నరనారాయణులకు క్షమాపణ చెప్పుకొని ప్రణమిల్లాడు. నారాయణుడు ఊర్వశిని తీసుకుపొమ్మన్నాడు. అప్సరసలతో కలిసి ఊర్వశి స్వర్గలోకం చేరింది.

నారాయణుడు, నరుడు ఒకరు తపస్సు చేస్తుంటే ఒకరు విల్లమ్ములు ధరించి సహస్రకవచుడితో పోరాటంచేస్తూ, అలాగ వేల సంవత్సరాల పాడుగున సాగిన యుద్ధంలో, తొమ్మిదివందల తొంభైతొమ్మిది సహస్రకవచుడి కవచాలను ఛేదించారు.

సహస్రకవచుడు ఒకే కవచంతో పారిపోయి సూర్యుడిలో దాక్కున్నాడు.

"ప్రగల్భాలు పలికి చివరికి పారిపోయి దాక్కున్నాడు, పిరికిపంద! వీడి పని కృష్ణావతారంలో పట్టించాలి!" అని విష్ణువు నిశ్చయించుకున్నాడు.





# సమర్థుడు

దంతపురి రాజ్యాన్నేలే మహారాజు పద్మనందుడు మారువేషంలో దేశసంచారం చేస్తూ, ఒక గ్రామంలో అనుకోకుండా ఉన్నపళాన జబ్బుపడ్డాడు. ఆ గ్రామంలో సీతన్న అనే రైతు పద్మనందుణ్ణి సమయానికి ఆదుకుని వైద్యం చేయించాడు.

తన ఆరోగ్యం కుదుటపడ్డాక పద్మనందుడు తానెవరైందీ రైతుకు చెప్పకుండా, ''నీవు చేసిన ఉపకారం మరువలేనిది. రాజధానిలో నాకు మంచి పలుకుబడి వున్నది. నీకు ప్రత్యుపకారం ఏం కావాలో అడుగు,'' అన్నాడు.

రైతు వినయంగా, ''నాకేం కోరికలూ లేవు. నేరకపోయి నా రెండోకొడుకు దండకుడికి, చదువు చెప్పించాను. ఇప్పుడు వాడు వ్యవసాయం చేయనంటున్నాడు. ఏ చోటనైనా కొలువులో పెడదామంటే, వాడు తలబిరుసుమనిషి. అందరితోనూ కజ్జాలు పెట్టుకుంటాడు. వాడు ముందు, ముందు ఏమైపోతాడో అని, నా కెంతో బెంగగా వున్నది,'' అన్నాడు.

పద్మనందుడు వెంటనే, ''నీ కొడుకును, నాతో పంపించు. వాడి భవిష్యత్తు నేను చక్కదిద్దుతాను. నీకెలాంటి బెంగా అవసరం లేదు,'' అన్నాడు.

దండకుడు కూడా రాజధానికి వెళ్లాలని ఉబలాటపడ్డాడు. తండ్రి సంతోషంగా వాణ్ణి, పద్మనందుడితో పంపించాడు.

రాజధాని చేరుకున్నాక, రాజు దండకుడికి ఒక సత్రంలో బసఏర్పాటు చేయించాడు. ప్రయాణంలో కలిగిన అనుభవాన్నిబట్టి, దండకుడు నిజంగానే దుడుకుమనిషి అనీ, వాడు కొలువుకు పనికిరాడనీ ఆయన గ్రహించాడు. అయినా, రైతుకు యిచ్చిన మాట తప్పడానికి లేదు.

"వసుంధర"



దండకుణ్ణి సత్రంలో వదిలిం తరవాత రాజు, శమంతకుడికి కబురు పెట్టాడు. ఈ శమంతకుడు రాజ్యంలో జరిగే ఆదాయ వ్యయాలను పరిశీలించే అధికారిగా వుంటున్నాడు. అతడి కింద పదిమంది చిన్న అధికారులున్నారు. ప్రతి అధికారి వద్దా పన్నెండుగురు ఉద్యోగస్థులుంటారు.

శమంతకుడు చాలా సమర్థుడైన అధికారి అనీ, ఎటువంటివారి చేతనైనా పని చేయించగలడనీ కొలువులో అందరూ చెప్పుకుంటారు.

పద్మనందుడు, శమంతకుడితో, "దండకుడనేవాణ్ణి, నువ్వు పనిలోకి తీసుకోవాలి. వాడు తలపొగరుమనిషి; చాలా దుడుకు స్వభావం. ఉద్యోగం పోతుందేమో అన్న భయం వాడికి లేదు. శిక్షలకు భయపడని మొండితనం కూడా వాడికున్నది. నీవు సమర్థుడైన అధికారివని అంతా అంటున్నారు. వాణ్ణి లొంగదీయడం, నీ సమర్థతకు పరీక్ష!'' అన్నాడు.

"మహారాజా, వాణ్ణి నేను తప్పక లొంగదీయగలను. రేపు నా వద్దకు పంపండి,'' అన్నాడు శమంతకుడు వినయంగా.

మర్నాడే దండకుడు, శమంతకుణ్ణి కలుసుకున్నాడు. శమంతకుడు వాడిని కొన్ని ప్రశ్నలు వేశాడు. దండకుడు అన్నింటికీ తలబిరుసు సమాధానాలే చెప్పాడు.

అయినప్పటికీ శమంతకుడు కోపగించుకోకుండా, "నీవు, నాకు బాగా నచ్చావు. నీవల్ల మాకెంతో ప్రయోజనం వున్నదనిపిస్తున్నది. నీకు నెలకు యాభై వరహాల జీతం యిస్తాను,'' అన్నాడు.

ఇందుకు దండకుడెంతగానో సంతోషించాడు.

శమంతకుడు తనవద్ద వుండే ఒక చిన్న అధికారిని పిలిచి, అతడికి దండకుణ్ణి అప్పగించాడు.

రెండు రోజుల తర్వాత, ఆ చిన్న అధికారి శమంతకుడి దగ్గిరకు వచ్చి,

''అయ్యా. ఆ దండకుడు పని చెయ్యడు; కొలువులో పని సాగనివ్వడు. వాడితో నేను వేగలేను,'' అని చెప్పాడు.

శమంతకుడు కోపంగా, ''నీ కింది వాళ్ళచేత పనులు చేయించలేకపోతే, అది నీ అసమర్థత అవుతుంది. వాడిచేత నువ్వు పని చేయించినాసరే—లేదా వాడి పని నువ్వు చేసినాసరే!'' అన్నాడు.

ఆ రోజు నుంచీ చిన్న అధికారి, దండకుడి పని కూడా తానే చేస్తుండేవాడు. ఈ కారణం వల్ల అతడికి దండకుడంటే చాలా కోపంగా వుండేది. రోజూ వాణ్ణి బెదిరిస్తూండేవాడు.

''నీ సంగతి రాజుకు తెలిస్తే, ఏదో రోజున ఆయన నిన్ను కఠినంగా శిక్షిస్తాడు. ఇక్కడి శిక్షలు భరించలేనివిగా వుంటాయి. జాగ్రత్త!'' అనేవాడు చిన్న అధికారి.

దండకుడు ఈ మాటలు లెక్క చేసేవాడు కాదు. కాని, రాజు విధించే శిక్షలు ఎలా వుంటాయో మాత్రం వాకబు చేసి తెలుసుకున్నాడు. అవి నిజంగానే చిన్న అధికారి చెప్పినట్టు చాలా కఠినంగా వున్నాయని వాడికి అనిపించింది.

కొన్నాళ్ళ తర్వాత రాజు పద్మనందుడు, శమంతకుణ్ణి పిలిపించి, ''దండకుడెలా పని చేస్తున్నాడు? దారికి వచ్చినట్టేనా?'' అని అడిగాడు.

"రాక ఎక్కడికిపోగలడు, మహారాజా!" అన్నాడు శమంతకుడు వినయంగా.





''ఆ అధికారికి చేతకాని పక్షంలో, దండకుణ్ణి మరొక సమర్థుడైన అధికారి దగ్గిరకు మార్చలేకపోయావా ?'' అన్నాడు రాజు.

''దండకుడి సంగతి, వాళ్ళందరికీ తెలిసిపోయింది. వాడిని, వాళ్ళు పనిలోకి తీసుకోరు,'' అన్నాడు శమంతకుడు.

''అయితే, నువ్వు, నా పరీక్షలో ఓడిపోయావు !'' అన్నాడు రాజు.

''లేదు, మహారాజా ! తమరు, నాకు అదనంగా ఒక మనిషిని యిచ్చారు. అప్పటి నుంచీ అదనంగా ఒక మనిషి చేయగల పని కొలువులో జరిగిపోతున్నది,'' అన్నాడు శమంతకుడు.

''అలా కాదు. నువ్వు, దండకుడి నుంచి పని రాబట్టుకున్నప్పుడే, సమర్థుడైన అధికారి వనిపించుకుంటావు,'' అన్నాడు రాజు.

''నాకు మరికొంత గడువివ్వండి. నా సమర్థతను ఋజువుచేస్తాను,'' అన్నాడు శమంతకుడు.

రాజు పద్మనందుడు యిందుకు అంగీకరించాడు.

శమంతకుడు, మర్నాడే దండకుణ్ణి పిలిపించి, ''నీకు కొలువులో ఉద్యోగం చెయ్యాలని వున్నదా, లేదా ?'' అని అడిగాడు.

రాజు ఆ జవాబుకు తృప్తిపడక, రహస్యంగా దండకుణ్ణి గురించి వివరాలు తెలుసుకుని, శమంతకుడికి కబురు పెట్టి, ''నువ్వు, దండకుడి ప్రవర్తనలో మార్పు తీసుకురాలేదు. నీ అధికార బలంతో, అమాయకుడైన కింది అధికారిని బెదిరించి, అతణ్ణి శ్రమ పెడుతున్నావు,'' అన్నాడు కోపంగా.

''అతడు అమాయకుడు కాదు, మహారాజా ! అధికారి దండకుడి చేత పని చేయించలేకపోతే, అది అతడి అసమర్థత అవుతుంది. అతడు తన అసమర్థతకు శిక్ష అనుభవిస్తున్నాడు,'' అన్నాడు శమంతకుడు.

దండకుడికి ఉద్యోగం నచ్చింది. రాజధానిలో ఇంటి అద్దెతో సహా వాడికి పాతిక వరహాలు కూడా ఖర్చు కావడం లేదు. గ్రామం కన్న పట్టణ జీవితం బాగున్నది. ఈ సంగతే వాడు, శమంతకుడికి చెప్పాడు.

శమంతకుడు కొంచెం సేపు ఆలోచించి, "నువ్వు తలబిరుసు మనిషివనీ, పని చేయవనీ, నీ అధికారి చెబుతున్నాడు. కాని, నేనా మాటలు నమ్మడం లేదు. నీలో నాకు వినయగుణం కనబడుతున్నది. కొంత కాలంపాటు నేనే, నీ సమర్థతను పరీక్షిస్తాను. ఆ అధికారి మాటల్లో నిజం కనబడితే, నీ ఉద్యోగం తీసేస్తాను. నువ్వు సమర్థుడివని ఋజువైతే—ఆ అధికారి ఉద్యోగం తీసేస్తాను. అంతే కాకుండా, నీ జీతం పెంచుతాను," అన్నాడు.

ఆ రోజు నుంచీ దండకుడిలో ఊహించని మార్పు వచ్చింది. కొద్ది రోజుల్లోనే వాడు పనిలో మంచి సమర్థుడని పేరు తెచ్చుకున్నాడు.

ఈ సంగతి విన్న రాజు ఆశ్చర్యపడి, శమంతకుణ్ణి పిలిపించి, "దండకుడిలో యింత మార్పు ఎలా తేగలిగావు?" అని అడిగాడు.

"వాడికి ముందు యిక్కడి కొలువులో వున్న సౌఖ్యం తెలియజేశాను, మహారాజా! తరవాత వాడి మీద చిన్న అధికారి ఫిర్యాదులు చేస్తున్నాడనీ, కాని వాటిని నేను నమ్మడం లేదనీ చెప్పాను. వాడు నిజంగా సమర్థుడైతే, చిన్న అధికారిని పనిలోంచి తొలగిస్తానని కూడా చెప్పాను. ఆ అధికారి మీది వైరం కొద్దీ వాడు ఎంతో శ్రద్ధగా పని చెయ్యడం మొదలుపెట్టాడు. ఒకసారి పని చెయ్యడం అలవాటుపడిం తరవాత, వాడు మామూలుగా అందరు ఉద్యోగుల్లాగే తయారయ్యాడు," అన్నాడు శమంతకుడు వినయంగా.

దండకుడి తండ్రికి తానిచ్చిన మాటను పూర్తిగా నిలబెట్టడంలో సహాయం చేసిన శమంతకుణ్ణి, రాజు పద్మనందుడు ఘనంగా సన్మానించాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1984 మే నెల సంచికలో ప్రకటింపబడును.



Pramod Bhanushali



Smt. V. Rajamani

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ మార్చి నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/—లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి :— చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జనవరి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇష్టమైన పలుకు

రెండవ ఫోటో : కష్టమైన వినకు

పంపినవారు : బి. రామాంజనేయులు, తాడిపత్రి, (అనంతపురం జిల్లా)

*బహుమతి మొత్తం రు. 50/-నెలాఖరులోగా పంపబడుతుంది.*

### మీకు తెలుసా ? సమాధానాలు :

1. బాణుడు; హర్ష చరిత్ర, కాదంబరి అనే గ్రంథాలు రాశాడు. 2. రాబర్ట్ బ్రౌనింగ్, ఎలిజబెత్ బారెట్ బ్రౌనింగ్. 3. చార్లట్ బ్రాంటి, ఎమిలీ బ్రాంటి. 4. హన్స్ క్రిస్టియన్ యాండర్సన్. 5. విలియం షేక్స్‌పియర్.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

రీటా కేశ సంరక్షణ



జుట్టు అద్భుతంగా ఉండేటట్టు చేసేది రీటా. దానిలో అటువంటి శక్తి, సువాసనా ఉన్నాయి - శిరోజాలు సహజంగా, చక్కగా పెరగడానికీ, వల్లదనానికీ, దానికదే సాటి.

రీటా వాడి మీ కురుల సౌభాగ్యాన్ని వృద్ధి చేసుకోండి. మీ శిరోజాలు ఏపుగా, ఒత్తుగా పెరిగి నిగనిగలాడుతూ మెత్తగా ఉంటాయి.




# రీటా

నేడే ఒక సీసా కొనండి
ప్రతిచోటా దొరుకును

స్త్రీలూ పురుషులూ వాడవచ్చును

ఇప్పుడు సూపర్ ఎకానమి (100 ml) సైజులో కూడా వస్తున్నది.